

"రహస్యం"

ఫొటో: ఎస్. కామేశ్వరరావు]



వెలుగు! వెన్నెల జిలుగు!

| | | |
|---|---|---|
| సంవత్సర చందా<br>రు. 13—0—0<br>విడిప్రతిక 25 న.పై | **ఆంధ్రపత్రిక**<br>సచిత్రవారపత్రిక | సంపుటము 52<br>సంచిక 9<br>**23-10-57** |

**Founder: K. NAGESWARA RAO**

హేవిళంబి ఆశ్వయుజం, బహుళ అమావాస్య, బుధవారం


 విషయానుక్రమణిక 

ముఖచిత్రం:

లంబాడి కన్య:
ఆభరణాలు

★


| | | | | | |
|---|---|---|---|---|---|
| న్యూఢిల్లీ లేఖ | — 4 | నక్షత్ర ఫలితాలు | — 8 | మాట పట్టింపులు | — 36 |
| దీపావళి | — 6 | కనువిప్పు | — 18 | నిమ్మకాయలు నిల్వచేయడం | — 37 |
| | | ఉపాధ్యాయ సమితి | — 17 | దీపావళికి పిండివంటలు | — 38 |
| | | అభిన | — 20 | మిగతాముక్కాణీ ఏంచేశావ్? | — 40 |
| | | పెళ్ళిచూపులు | — 23 | వనితావాణి | — 42 |
| | | పాతబంగళా | — 25 | బాలుడూ - చిలుకా | — 43 |
| | | అంతరిక్షయాత్రలో కొత్తమెట్టు | — 28 | మూడు వరాలు | — 44 |
| | | వధూవరుల నాటకం | — 32 | సినీమా | — 48 |
| | | వనితాలోకం | — 35 | | |

# పొరుగువారి నుండి

జమ్‌షెడ్‌పూర్, రౌర్‌కేలాల మధ్య రాకపోకలు జోరుగాయున్నాయంటే ఆశ్చర్యం లేదు. అది సహజమే: ఏలనన వున్న ఉక్కు కర్మాగారాల్లో కల్లా రౌర్‌కేలాలో లేస్తున్నది భారత దేశపు ప్రధమ స్టీల్ నగరమైన జమ్‌షెడ్‌పూరుకు చాల సమీపంలో వుంది.

ఈ రాకపోకలు ఇరువురి అభిప్రాయాలను, అనుభవాలను తెలుసుకొనుటకు దారితీసిన ఆశ్చర్యమేముంది. ఏలనన జమ్‌షెడ్‌పూర్‌లో గత 50 ఏండ్లగా ఉక్కు తయారగుచున్నది. రౌర్‌కేలాకు కావలసిన



ఇంజనీర్లు, సాంకేతిక సిబ్బందికి శిక్షణ నిచ్చుటలో చేయూతనిచ్చుట మహదానందము. ఇట్లు శిక్షణ పొందువారు జమ్‌షెడ్‌పూర్‌లో 150 మందికి పైగాయున్నారు.

## రౌర్‌కేలాకు శుభాశీసులు

రౌర్‌కేలాలో మీకు కనుపించు అసంఖ్యాక జమ్‌షెడ్‌పూర్ చిరపరిచితముఖాలు యీ మైత్రిని దృఢపరచుచున్నాయా అని అనిపించును. వారికి వారి సహచరులకు పొరుగునున్న జమ్‌షెడ్‌పూర్ పంపు అభివందనలు, శుభాకాంక్షలు.

**ది తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ లిమిటెడ్**

TN 1500




# కేంద్రమంత్రుల దుబారా ఖర్చులు!

శీతకాలం మెల్లగా, చల్లగా, చాటు చాటున రాత్రిళ్లు తొంగిచూసి పోవడానికి వస్తోంది. ఈ ఏడాది శీతకాలం కొంచెం పెందరాళే ప్రారంభమైంది. పగళ్ళుమాత్రం ఎండ ఫెళ్లున కాస్తూనే వుంది. దీపావళి సంరంభం కూడా ఆరంభమైంది. హిందువుల పండగలన్నిట్లోకీ దీపావళి సంతోష ప్రదమైనది. ఎంతదరిద్రుడైనా ఈ పండక్కి ఇంటికి వెల్లవేయిస్తాడు; ధనాధిదేవత లక్ష్మికి స్వాగతమిస్తూ దీపాలు వెలిగిస్తాడు.

భారతదేశం ఢిల్లీకాదు. పదవీ వ్యామోహితులకు, ఉద్యోగాల వేటగాళ్లకు, పెద్ద పెద్ద బిరుగులున్నవాళ్లకు ఢిల్లీ స్వర్గంలాంటిది. ఏపండగ వచ్చినా అధికారులు లేనిదే జరగదు. స్వాతంత్ర్యం రాకముందు రోజుల్లో రామలీలా ఉత్సవాలు ఢిల్లీ చీఫ్ కమీషనరు లేకుండా జరిగేవికావు. (వైస్రాయి, ఆయన కార్యనిర్వాహక వర్గ సభ్యులు ఉత్సవకర్తలకు అందుబాటులో ఉండేవాళ్ళు కారు.)

స్వాతంత్ర్యం వచ్చాక కొన్ని మార్పులు జరిగినవి. పాతపద్ధతి పోయింది. 'ప్రజలతో సాన్నిహిత్యం' అనే పేరుతో కొత్త పద్ధతులు అమల్లోకి వచ్చినవి.

'రామలీలా' నిర్వాహకులకు రాష్ట్రపతి భవనద్వారాలు తెరిచిన స్వర్గద్వారాలైనవి. రాష్ట్రపతి ఉత్సవాలకు హాజరవడమేకాక, ఉత్సవకర్తలతో కలిసి ఊరేగింపులో కూడా పాల్గొన్నారు. శ్రీరాముని వేషాలు వేసుకున్న బ్రాహ్మణ బాలురను అందరి సమక్షాన పూజకూడా చేశారు.

ఇటీవల ఢిల్లీ పత్రికలలో ఈ సమాచారం ఇలా ప్రకటించబడింది:—

"రావణుడు మొదలైన రాక్షసుల బొమ్మలను తగలబెట్టే ఉత్సవ దినానికి ముఖ్య అతిథిగా ఎవర్ని ఆహ్వానించాలా అని రామ

### శ్రీ కృష్ణ

[ ఆంధ్రపత్రిక ప్రతినిధి ]

లీలా నిర్వాహకులు బుధవారం సాయంత్రం దాకా మథనపడ్డారు. రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి అనారోగ్యకారణాలవల్ల హాజరుకాలేమన్నారని ఉత్సవ నిర్వాహకుల్లో ఒకాయన పత్రికా ప్రతినిధులతో చెప్పాడు. ప్రధాని నెహ్రూ ఆ ఉదయమే జపాన్‌కు ప్రయాణమై వెళ్ళిపోబోతున్నారు హోంమంత్రి దేశపర్యటనం చేస్తున్నారు. రక్షణమంత్రి మకాం న్యూయార్క్‌కు మారింది. ఆనాటి ఉత్సవాలకు ప్రధాన అతిథిగా వచ్చే నాయకుణ్ణి రామలీలాఉత్సవాల కమిటీ అధ్యక్షుడు తన సరసన కారులో ఎక్కించుకుని ఉత్సవ మైదానంలో తిప్పడం, తర్వాత ఆ నాయకుడితో కలసి ఫొటో తీయించుకోడం మొదటినుంచీ వస్తున్న ఆచారం"

ముఖ్యనాయకులే కాకుండా రాజధానిలో మంత్రులు, సహాయమంత్రులు, పార్లమెంటరీ కార్యదర్శులు మొదలైన ఇతరులు అనేకమంది లేకపోలేదు. అయితే కమిటీ దృష్టిలో వీ రందరూ ప్రధాన అతిథి స్థానానికి అనర్హులు; వస్తే రాష్ట్రపతే రావాలి; లేకపోతే, కనీసం రక్షణమంత్రి రావాలి. మిగతావా రంతా అయోగ్యులే.

ఇంతే కాదు. 1947 ఆగస్టు 15 అనంతరం రాజధానిలో ఏ మత, సాంఘిక, రాజకీయ ఉత్సవం జరిగినా విదేశీ రాయబారులు, రాజకీయవేత్తలు పాల్గొనడం కూడా పరిపాటి అయింది.

మత, కుల, వర్గరహిత సమాజ నిర్మాణం కాంగ్రెస్ ధ్యేయమైనప్పుడు ఇలాటి ఉత్సవాలను కాంగ్రెస్ పెద్దలు ఎందు అభిమానిస్తారో దురూహ్యం. మన హిందూ పురాణాల ప్రకారం శ్రీరాముడు "క్షత్రియుడు." రామలీలా ఉత్సవాలలో రాముడి పాత్రను ఎందుకు బ్రాహ్మణుడే ధరించాలి?

ఈ ఉత్సవాలకు అధికార ప్రోత్సాహం ఎంత త్వరగాపోతే అంత మంచిది. వీటిని మీరెందుకు అభిమానిస్తున్నారని ఏ అధికారినైనా ప్రశ్నిస్తే, ప్రజాబాహుళ్యంతో ప్రత్యక్ష సాన్నిహిత్యం ఏర్పాటు చేసుకోడానికే నంటాడు. ఈ ఉత్సవాలలో నిజానికి ప్రత్యక్ష పరిచయానికే అవకాశం లేదు. మంత్రి పదవులలో వున్న అగ్రనాయకులతో కొందరు ప్రబుద్ధులు భుజాలు రాసుకు తిరగడానికీ, వారి దృష్టిలో పడడానికి మాత్రమే ఇవి ఉపయోగపడుతున్నవి! కొంతమంది స్వార్థపరులు తాము ఏ రాష్ట్రపతితోనో, ఏ ప్రధానితోనో కలిసి తీయించుకున్న ఫొటోలను అమూల్యమైన వాటిగా భావించడం జరుగుతున్నది. ఇందుకు ఒక చిన్న ఉదాహరణం చెబుతాను. పాత కేంద్రశాసనసభ సభ్యుడొకాయన వుండేవాడు. న్యూఢిల్లీలోని ఎలక్ట్రిక్ లేన్‌లో వున్న తన ఇంటి గోడలమీద ఎక్కడ చూసినా ఆయన ఫోటోలే! ఇవన్నీ తాను

అప్పటిరాజప్రతినిధికీ, ఇతర ఉన్నతోద్యోగులకు పూలదండలు వేస్తుండగాతీయించుకున్న ఫోటోలు. చివరకు ఆ శాసన సభ్యుడు చచ్చిపోయేనాటికి బోలెడంత ఆస్తి వెనకేశాడు! మరి ఇలాంటి ఫోటోల వల్ల ఎంత ప్రయోజనముందో ఆలోచించండి!

* * *

ప్రస్తుతం దేశం ఆర్థిక విపత్తును ఎదుర్కొంటున్నది కదూ? అందుచేతే అందరూ మితవ్యయాన్ని అలవరుచుకోవాలని ప్రధాని నెహ్రూ ప్రభృతులు పదేపదే ప్రబోధించడం జరుగుతున్నది. ప్రధాని కేవలం ప్రబోధించడమే గాక ప్రబోధాన్ని శక్తికొద్దీ ఆచరణలో కూడా పెడుతున్నారు. ఈ విషయంలో ఇతరుల ధోరణి ఎలా వుందో తెలుసా?

కాశ్మీర్ రాజ్యాధిపతి సదర్-ఇ-రియాసత్ శ్రీనగర్ లో సమాజ వికాస కార్యక్రమశాఖోద్యోగుల మహాసభకు ఇటీవల ప్రారంభోత్సవం జరిపారు. వివిధ ప్రాంతాలకు చెందినవారు దాదాపు 150 మంది ప్రతినిధులు దీనిలో పాల్గొంటున్నారు!

ఒక కేంద్రమంత్రి ఈ మధ్యే 800 రూపాయలు పెట్టి కాలిజోళ్ళు తగిలించుకునే 'బూట్ స్టాండ్' కొన్నాడు! మరొక మంత్రి కోళ్ళ పెంపకం మీద మోజుపడి 1600 రూపాయలుపెట్టి 'కోళ్ళ గుడిసె' నొకదాన్ని అమాంతం కొనివేశాడు! ఈ కోళ్ళు కొక్కరాళ్ళు అన్నీ ప్రజాధనంలో జరిగిన కొనుగోళ్ళే!

మరో విషయం. ఒక మంత్రి ఇంట్లో ఈ మధ్యే చాలా ఖర్చుపెట్టి ఫర్నిచర్ అమర్చారు. దానిలో ఇప్పుడు మరో మంత్రి వుంటున్నాడు. ఐదు వేల రూపాయల ఖర్చుతో అదే ఇంట్లో సరికొత్త ఫర్నిచర్ అమర్చుకోవాలని ఈ కొత్తమంత్రి తాపత్రయపడుతున్నాడు. ఇటీవలే 28 వేల రూపాయలు ఖర్చుచేసి సమస్తహంగులూ ఏర్పరచిన ఒక ఇంట్లో ఇంకా ఖర్చుచేసి మరికొన్ని కొత్తహంగుల ఏర్పాటుకు ఇంకోమంత్రి తహతహ లాడుతున్నాడు!

అతడికంటె ఘనుడు ఆచంటి మల్లన్న అన్నట్టు ఇంకోమంత్రి తానుంటున్న ఇంటి రూపురేఖలనే మార్చివేయాలని ముచ్చటపడుతున్నాడు. పన్నెండు వేల రూపాయల ఖర్చుచేసి తన ఇంటిని పెద్ద మేడగా పునర్నిర్మించాలని ఇతడి వాంఛ.

మహాత్ముని నిరాడంబర జీవిత విధానాన్ని అందరూ అలవరచుకోవాలనీ, ఆయన అడుగుజాడలనే అనుసరించడానికి అందరూ కంకణధారులు కావాలనీ నిన్న గాక మొన్న పెద్దపెద్ద ప్రబోధాలు చేసిన ఘనులే ఇంత హంగామా చేస్తున్నారు!

ప్రధాని ఒక్కడూ ఎన్ని వ్యవహారాలని ఇలాంటివి చూడగలడు?

* * *

సెప్టెంబరు 30 సోమవారంనాడు ఢిల్లీలో బ్యాంకుఉద్యోగులు రెండుగంటల పాటు సమ్మెచేశారు. అసలు ఇక్కడ బ్యాంకులు పనిచేసేదే ఉదయం పదిమొదలు రెండుగంటల వరకూ. అంటే నాలుగంటలు. అందులో రెండు గంటలసేపు సమ్మెతోనే సరిపోయింది. ఆవిధంగా ఆరోజున బ్యాంకులు రెండే రెండుగంటలపాటు పని చేశాయన్న మాట! నెగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంట్స్ ఆక్టు క్రింద మంగళ, బుధ, గురు, శుక్ర వారాలు సెలవులు. అక్టోబరు 5వ తేదీ శనివారంనాడు బ్యాంకులు రెండు గంటలు మాత్రమే పని చేసినవి. మళ్లీ ఆది సోమ వారాలు సెలవు. ఈవిధంగా సెప్టెంబరు 30 సోమవారం మొదలు, అక్టోబరు 7సోమవారం వరకూ ఢిల్లీలో బ్యాంకులు మొత్తం 6గంటలసేపుమాత్రమే పనిచేసినవన్నమాట! ఇక్కడ మనదేశపు పరిస్థితి ఇలావుంటే, అక్కడ ప్రజాస్వామిక రాజ్యమైన స్విట్జర్లాండులో బ్యాంకులు ఉదయం ఏడున్నర మొదలు సాయంత్రం ఐదున్నరవరకూ పనిచేస్తుంటవి. ఫలాహారానికని మధ్య రెండు గంటల విరామం మాత్రం వుంటుంది. ఆ బ్యాంకులు ఈవిధంగా రోజుకు మొత్తం 8 గంటలసేపు పనిచేస్తూంటవి. పనిచేసే గంటలు ఎక్కువైనప్పటికీ, వేతనాలు మామూలుగా తక్కువే అయినప్పటికీ స్విస్ బ్యాంకు ఉద్యోగులు సమ్మెచేయలేదు సరికదా, తమను పారిశ్రామిక ఉద్యోగులుగా మార్చవలసిందని కూడా ఎన్నడూ కోరలేదు.

ఇవన్నీ తలుచుకుంటే మనదేశంలో బ్యాంకులకు ఇచ్చే సెలవురోజులను క్రమబద్ధం చేసే మార్గమేమీ లేదా అనిపిస్తున్నది. అసలు భారతీయులు తమ సెలవురోజులను తగ్గించుకుని, ఎక్కువ పని చేయవలసిన ఆగత్యం ఏర్పడిందేమో ననిపిస్తున్నది. ఇంగ్లండులో రాణీ జన్మదినోత్సవం జరిగే రోజుకూడా సెలవు వుండదు. మన బ్యాంకులు ముఖ్యంగా మాసారంభంలో వారం మొత్తం మీద ఆరే ఆరు గంటలు పనిచేస్తే దేశం ఏవిధంగా ముందంజవేయగలుగుతుంది?



కార్మికమంత్రిగా జగ్జీవన్‌రామ్ అనుసరించిన విధానాల ఆర్థిక ఫలితాలపర్యవసానం ఏమిటో ఇంకా తేలవలసి వున్నది. బ్యాంకు ఉద్యోగులను శ్రామికవర్గం జాబితాలో చేర్చినఖ్యాతి జగ్‌జీవన్‌రామ్‌దే. బ్యాంకింగ్ వ్యవహారం అయోమయంగా తయారు కావడానికి అదే మొదలు! బ్యాంకుపనివారి చరిత్ర ఒక అగాథమైన అవకతవకల గాథగా తయారుకావడానికి కూడా అదే మొదలు. ఒక న్యాయశాఖోద్యోగిని పరిష్కర్తగా నియమించడమే తప్పు. పారిశ్రామిక వివాదాల స్వభావానికీ, మామూలు శాసనాల స్వభావానికీ ఎక్కడా పొందిక కుదరదు. పారిశ్రామిక వివాదాలు ఆర్థిక సంబంధమైనట్టివి; ఆ ఆర్థిక ఫలితాలను న్యాయశాఖోద్యోగి సక్రమంగా అవగాహన చేసుకోలేడు.

తమకు బోనసు ఇవ్వకపోతే దేశవ్యాప్తమైన సమ్మె జరుగుతుందని బ్యాంకు ఉద్యోగుల సంఘనాయకుడు హెచ్చరిక చేశాడు. ఈ పరిస్థితులలో సానుభూతి సమ్మెల నిషేధానికికూడా ప్రభుత్వం చర్య తీసుకోవలసి వుంటుంది. అవసరమైతే బ్యాంకు ఉద్యోగులను శ్రామిక వివాదాల శాసన పరిరక్షణ నుంచి ప్రభుత్వం తొలగించివేసినా ఆశ్చర్యపడనవసరం లేదు! ★

# దివ్య కాంతులు

రంగురంగుల వెలుగుపువ్వులు పూసే చువ్వలు-అగ్నిపర్వతంలాగ ఆకాశం తిలావా పైకి చిమ్మే చిచ్చుబుడ్లు-కుండ బద్దలు కొట్టినట్టు నిర్మొహమాటంగా పేలే టపాకాయలు-చిన్నసైజు ఖండాంతర వేధుల్లాగ గగనవీధుల కెగసే తారాజువ్వలు-చీకటిని ఊడ్చి పారేసే చీపురుకట్టల్లాంటి తోటాలు-అరుగులమీదా, గోడల మీద, గూళ్ళల్లోనూ, గుళ్ళల్లోనూ నక్షత్రాల బారుల్లాగ తీర్చిదిద్దిన ప్రమిదలు-వీటన్నిటినీ వెంటబెట్టుకుని సంతోషానికి మారు పేరులా దీపావళి పండుగ కన్నులపండుగగా మళ్ళీ వచ్చింది.

చీకటి భయంలాంటిది. దుఃఖానికి, మరణానికి ఇది సంకేతం. వెలుగులో వేరువేరు రూపాలతో విలసిల్లే వస్తువులు చీకట్లో 'ఇది అది' అనే భేదంలేని శూన్యంలాంటి ఏకాకృతి పొందుతాయి. ఈ చీకటిని పరిహరించేది వెలుగు. పరబ్రహ్మను జ్యోతిస్స్వరూపంగా భావించారు మన మహర్షులు. "తమస్సుకు అవతలితీరాన ఆదిత్యవర్ణంతో ఉన్న మహాపురుషుణ్ణి దర్శించాను నేను" [ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్] అని ఒక మహర్షి చెప్పుకున్నాడు. "అక్కడ సూర్యుడు, చంద్రుడు ప్రకాశించరు. తారకలు వెలగవు. విద్యుత్తు, అగ్ని కాంతిహీన మవుతాయి. అక్కడి మహాజ్యోతివల్లనే ఈ సూర్యుడు, చంద్రుడు ప్రకాశిస్తున్నారు. ఆ జ్యోతివల్లనే మెరుపు, అగ్ని కాంతివంత మవుతున్నాయి" అనే అర్థం వచ్చే (నతత్ర సూర్యోభాతి నచంద్ర తారకం - నేమావిద్యుతోభాంతి కుతోయమగ్నిః-తమేవభాంత మను భాతి సర్వం-తస్యభాసా సర్వమిదం విభాతి) శ్లోకంతో ఉపనిషత్కారులు పరంజ్యోతిని కీర్తించారు. ఆ జ్యోతి స్స్వరూపానికి ప్రతీకలుగా అసంఖ్యాకమైన దీపసహస్రాలను వెలిగించే దీపావళీపర్వం భారతీయుల పండుగలన్నిట్లోకీ మహార్థ ప్రతిపాదకమైనది.

దీపావళి రెండురోజుల పండగ. ఇది ప్రతిసంవత్సరం ఆశ్వయుజ అమావాస్యనాడు జరుపుతున్నాము. ఆ క్రిందటిరోజు (ఆశ్వయుజ కృష్ణ చతుర్దశి) కూడా పండుగలోనే లెక్క. ఈ పండుగను గూర్చి అనేక సిద్ధాంతాలు, కథలూ ఉన్నాయి. ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడు సత్యభామా ద్వితీయుడై నరకాసురుణ్ణి వధించినది ఆశ్వయుజ కృష్ణచతుర్దశి నాడేననీ, అందుచేత ఆ నాడు నరకచతుర్దశి అనీ, మరునాడు నరకాసురవధకు సంతోషసూచకంగా దీపాలు వెలిగించి పండుగ చేసుకుంటామని బహుళ ప్రచారంలో ఉన్నకథ.

కృతయుగంలో బలిచక్రవర్తిని విష్ణుమూర్తి మూడడుగుల నేల యాచించాడనీ, ఒక అడుగుతో భూమిని, మరొక అడుగుతో ఆకాశాన్ని ఆక్రమించి మరొక అడుగును బలితలపై ఉంచి అతన్ని పాతాళానికి తొక్కివేశాడని, అతని దానశీలానికి మెచ్చి ప్రతిసంవత్సరం ఒకసారి భూలోకానికి వచ్చి మానవుల పూజలందుకోమని విష్ణుమూర్తి వరమిచ్చాడని ఒకకథ ఉన్నది. దీపావళి పండుగకు బలిచక్రవర్తి బొమ్మను తయారుచేసి పూజలుచేయడం, దీపమాలికలు పెట్టి ఆయనకు స్వాగతమివ్వడం ఈనాటికీ కొన్నిచోట్ల ఆచారం ఉన్నది.

త్రేతాయుగంలో శ్రీరాముడు రావణవధానంతరం అయోధ్యకు తిరిగివచ్చి పట్టాభిషిక్తుడైనది దీపావళి అమావాస్య నాడేనని, అందుచేత ఆ పట్టాభిషేక మహోత్సవానందసూచకంగా ఆనాడు పండగ చేసుకుంటున్నామనీ మరొకకథ ఉన్నది. కలియుగంలో విక్రమార్కుడనే చక్రవర్తికూడా ఆనాడే పట్టాభిషిక్తుడైనాడనీ, అందుచే అది భారతీయులందరికి పండుగ అయిందని ఇంకొకకథ.

ఉత్తర భారతంలో దీపావళి నాడు లక్ష్మీపూజ చేస్తారు. వంగదేశంలో ఆనాడు కాళీపూజ చేస్తారు. అశోకుడు కళింగదేశం జయించిన దినం దీపావళి అని బౌద్ధులమతం. జైనులు అసలు దీపావళి తమ పండుగ అనీ, తీర్థంకరులలో ఒకడైన మహావీరుడు నిర్వాణం పొందిన శుభదినం కనుక భారతీయులు దీపావళి పండుగ చేసుకుంటున్నారనీ వాదిస్తున్నారు. జైన వ్యాపారస్తులు దీపావళి నుంచి కొత్తవ్యాపారాలు ప్రారంభిస్తారు. "దివాళీ" నాడు ప్రారంభించిన వ్యాపారం "దివాళా" తీయదని వారి భావం కావచ్చు.

మొదటి పైరు పండిన తరువాత రెండో పైరుకోసం పొలాలకు ఎరువుగా పెంట సంతటినీ తోలి పెంట వదలించుకోవటమనే ఆచారాన్ని ఆధారంగా చేసుకుని దీపావళి పండుగ ఏర్పడిందని మరికొందరు భావిస్తున్నారు.

దీపావళి అయిదురోజుల పండుగ అని కొందరి మతం. మొదటినాడు నిధనత్రయోదశి. నిధనం అంటే మరణమనీ, ప్రళయమనీ అర్థాలు. ఆనాడు ఏం ఉత్సవం చేస్తారో చెప్పటానికి ఆధారా లెక్కడా లేవు. రెండవనాడు నరకచతుర్దశి. ప్రాగ్జ్యోతిష పురాధిపతి, లోకకంటకుడు అయిన నరకాసురునిపై శ్రీకృష్ణ విజయానికి చిహ్నంగా ఈనాడు పండుగ చేస్తారు. ప్రాతఃకాలమందే లేచి అభ్యంగన స్నానం చేసి యమ తర్పణం విడవడం ఒక ఆచారం ఉన్నది. దక్షిణాభిముఖంగా తిరిగి యమ ధర్మరాజును స్తుతిస్తూ (యమాయ ధర్మ రాజాయ మృత్యవేచాంతకాయచ) తర్పణం విడిస్తే నరకలోక దర్శనం ఉండదట.

మూడవనాడు ఆశ్వయుజ అమావాస్య-దీపావళి. (దీపైః నీరాజనాత్ అత్ర సైష దీపావళీ స్మృతః) ఈరోజున లక్ష్మీ పూజ చేస్తారు. పగలు ఉపవాసం ఉంటారు. ప్రదోషసమయంలో దీపమాలికలు వెలిగిస్తారు. ఈ దీపాలు లక్ష్మీదేవికి స్వాగతమివ్వడానికి ఉద్దేశింపబడినవి. ఆమె ఆనాడు అర్ధరాత్రప్పుడు గృహాల్లో ప్రవేశిస్తుందట. లక్ష్మీదేవి పూజావిధానమంతా దేవీ భాగ





దీపావళి పాప
ఫొటో: వి. కేశవశర్మ.

వతంలో కనిపిస్తుంది.

రాక్షసులను వధించిన తరువాత కాళికాదేవి హింసోన్మత్తరూపంతో ప్రళయతాండవం చేస్తుండగా పరమేశ్వరుడు ఆమె కెదురువెళ్ళి ఆమె క్రోధం శాంతింపజేసినాడనీ, కాళికాదేవి క్రోధం పోగొట్టినందుకుగాను శివుణ్ణి, కాళినీగూడా మానవులు దీపోత్సవాలతో ఆరాధించినారనీ, ఆనాటినుంచీ దీపావళి ఆరంభమైందని కొందరి మతం.

నాల్గవనాడు కార్తిక శుద్ధ పాడ్యమి. ఈరోజున పగలు గోపూజ, ద్యూతక్రీడ జరుగుతుంది. రాత్రి బలిపూజ చేస్తారు. 'గో' శబ్దానికి కిరణమనే అర్థం ఉన్నది. అందుచేత సూర్యకిరణపూజ అని భావించవచ్చు. కృష్ణుడు గోవర్ధనపర్వతమెత్తి గోవులను, గోపకులను రక్షించినదానికి కృతజ్ఞతగా గోవర్ధనపూజకూడ కొన్నిప్రాంతాల్లో చేస్తారు. తరవాత ద్యూతక్రీడ జరుగుతుంది. ఈనాడు పూర్వం పార్వతి శంకరునితో జూదమాడి గెలిచిందట. అందుచేత దానికి సంకేతంగా ఈనాడు జూదమాడుతారు. జూదంలో గెలిచినవారికి సంవత్సరం పొడుగునా జయం లభిస్తుందని నమ్ముతారు. ద్యూతానంతరం రాత్రి భార్యాభర్తలు గదినిండా దీపాలు వెలిగించి సుఖశయనులై నిద్రించాలట. ఈ పండుగను సుఖరాత్రి అనికూడా అంటారట. బలిపూజ చేయడం ఈనాటిరాత్రి విశేషాలలో ఒకటి.

అయిదవనాటి పండుగను యమద్వితీయ అంటారు. ఆనాడు యముడు తన చెల్లెలైన యమునిని చేరి ఆమె ఆతిథ్యం పొంది సర్వదారిద్ర్యాలు నశింపజేసుకున్నాడని, అది ఆధారంచేసుకునే యమద్వితీయనాడు "భగినీ హస్త భోజనం" అనే ఆచారం ఏర్పడిందనీ చెబుతారు. ఆనాడు యమునలో స్నానంచేసి తర్పణాలు విడిస్తే పాపక్షయమవుతుందని 'నిర్ణయసింధువు' మొదలైన ధర్మశాస్త్ర గ్రంథాలు చెబుతున్నవి.

అయితే ఆ యీ దినాల్లో చేసే పూజాదికాలన్నీ ఇప్పుడన్ని ప్రాంతాలలోనూ అమలులో లేవు. కొన్ని ప్రాంతాల్లో కొన్ని కొందరు మాత్రమే ఆచరిస్తున్నారు. ఆంధ్రదేశంలో సర్వత్రా చేసే పండుగ చతుర్దశి, అమావాస్యనాటి పండుగలే. ఇంటికి వెల్లవేయించి, ముగ్గులువేసి రమ్యంగా అలంకరిస్తారు. అభ్యంగస్నానాలు చేసి, నూత్నవస్త్రాలు ధరిస్తారు. పితరులకు తర్పణాలు వదలి, దానధర్మాలు, విందులు చేస్తారు. అల్లుళ్ళను పిలుచుకువచ్చి మర్యాదలు జరుపుతారు. సాయంత్రం చీకటి పడుతుండగనే ప్రమిదలలో నూనెపోసి వత్తులువేసి వెలిగించి బారుగా పెడతారు. మందుసామగ్రి కాలుస్తారు. టపాకాయలు పేలుస్తారు. ఉత్సాహముగల యువకులు దివిటీలు పట్టి వీధుల్లో విహరిస్తారు. రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకూ దీపమాలికలు వెలుగుతూ, టపాకాయలు పేలుతూనే ఉంటాయి. పూర్వకాలంలో దీపాలు వెలిగించడం, దివిటీలు తిప్పడం మాత్రమే ఆచారంగా వుండేదనీ, బాబరు దండయాత్రకాలంలో మందుగుండు ఉపయోగం లోకి వచ్చిన నాటినుంచీ రకరకాల టపాకాయలు అమల్లోకి వచ్చాయనీ చెబుతారు.

దీపావళి మనపండుగలన్నిటిలోకీ అందమైన పండుగ. ఎంత డబ్బు ఖర్చుపెట్టి ఎంత బాణసంచా కొనితెచ్చినప్పటికీ, అది అంతా ఎలాగూ తగలబడి మిగిలేది బూడిదేనని, కనుక ఈ పండగ దండగేనని కొందరు వాదిస్తే వాదించవచ్చును గాక. అయినా దానందం దానిదే. రంగురంగుల వెలుగులు చిమ్మే బాణసంచా కాల్చి, చీకటిని పటాపంచలు చేస్తూ వుంటే కలిగే ఆనందంకోసం ఆమాత్రం చమురు ఖర్చయితేనేం? ఎటొచ్చీ కొంచెం వళ్లు దగ్గిర పెట్టుకుని కాల్చకపోతే ఇలూ వళ్ళూ కూడా బాణసంచాగా మారిపోయే ప్రమాదం ఉన్నది.

అటువంటి ప్రమాద మేమీ జరగకుండా ఈ దీపావళి ఆంధ్ర మహాజనులకు ప్రమోదం మాత్రమే కలిగిస్తుందని ఆశిస్తున్నాము. ★



# నక్షత్ర ఫలితాలు

**(23-10-57 మొదలు 29-10-57 వరకు)**

బి. నరసింగరావు

## గ్రహ స్థితి.

| | | | |
|---|---|---|---|
| | కే | | |
| | 29 తేదీరాత్రికుజుడు తులకు మారును; తుల, వృశ్చిక, ధనుర్మకరములలో చంద్రుడు. | | |
| | శు శ | ర బు రా | గు కు |

## *అశ్విని [చూ, చే, చో, లా]*

గతవారము మొదలైన శుభయోగము మీకు ఈ వారముకూడా వుంటుంది. ధనాదాయము హెచ్చుతుంది. సకాలములో మిత్రుల సహాయమువల్ల యత్నకార్యములు సిద్ధించి తృప్తిని పొందుతారు. ఉద్యోగులకు యజమానుల ఆదరణ లభిస్తుంది. వర్తకులకు లాభదాయకముగా వుంటుంది. కుటుంబములో శుభకార్యములు చేయుటకు నిశ్చయము కలుగుతుంది. విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. కవులకు, గాయకులకు, నటీనటులకూ మంచి కాలము. 23, 24 తేదిలలో కొంత తొందరపాటు, అశాంతి. 26వ తేదిని బద్ధకముచే కార్యములలో ఆలస్యము. ప్రయాణ సూచనలు.

## *భరణి [లీ, లూ, లే, లో]*

మీకు గతవారలో కలిగిన శుభయోగము ఈ వారమందు తగ్గుముఖ మవుతుంది. శరీరమునకు ఎక్కువ శ్రమ కలిగే పనులు చేసిననూ అందుకుతగ్గ ఫలితము లేకపోవుటచేతను, ఆశించిన ఆర్థిక సహాయము సకాలములో రాకపోవుటచేతనూ మనోవ్యధ పొందుతారు. అకాలభోజనమువల్ల ఆరోగ్యము చెడేసూచనలున్నవి. మొదట్లోనే జాగ్రత్తపడడం మంచిది. కోర్టు వ్యవహారములు వాయిదాపడడంగాని, ప్రతికూల తీర్పులు కల్గుటగాని జరుగును. ఉద్యోగస్థులకు అసంతృప్తిగా ఉంటుంది. వ్యాపారస్థులకు ఉత్సాహము వుండదు. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ తగ్గుతుంది. 28, 24 తేదిలలో అధికశ్రమ. 26-వ తేదీ అనారోగ్య సూచన. వారాంతమందు ప్రయాణము, ఖర్చులు ఎక్కువ.

## *కృత్తిక [ఆ, ఈ, ఊ, ఏ]*

కార్యసాధనకు మీశక్తినంతటినీ ఉపయోగించి సాహసము చూపించినను మొదట్లో ప్రతికూలముగా ఉండేటట్లు కనబడుతూ, చివరకు కొందరు మిత్రుల సహాయమువల్ల సానుకూలమయే సూచన లున్నవి. కార్యభారము పైనివేసుకొనుటచేతను శ్రమ ఎక్కువ, ఫలము తక్కువగాను వుంటుంది. ఆర్థికచిక్కులు వుంటవి. ఉద్యోగులకు పని తొందర ఎక్కువవుతుంది. కుటుంబమందుండువారికి అనారోగ్య సూచనలు. వ్యాపారస్థులు కిందామీదా పడతారు. విద్యార్థులకు ఉత్సాహము తక్కువవుతుంది. 23, 24 తేదిలలో శ్రమ అధికము. 25-వ తేదిని మిత్రులవల్ల లాభము. వారాంతమందు కొంత మార్పు. ఖర్చులు యెక్కువ.

## * రోహిణి [ఓ, వా, వీ, వూ]*

ఈ వారమున మీకు పుణ్యకార్య చింత యెక్కువగుటచేత ఆర్థికలోపము కలిగినను, యత్నకార్యములు అనుకూలించకపోయినను నిండుకుండలాగున తొణకకుండా వుంటారు. మీకున్న విజ్ఞానసంపద వృద్ధిపొందుతుంది. సంసారముపైని మీరు నిర్లక్ష్యము చేస్తున్నట్టుగా భావించడమువల్ల ఇంట్లో అశాంతి ఏర్పడుతుంది. ఉద్యోగులకు వత్తిడి ఎక్కువైననూ ఓర్పుతో పనులు చేసుకుంటారు. కొత్త సంగతులను నేర్చుకుంటున్నప్పటికీ, విద్యార్థులకు చదువుమీద శ్రద్ధ తగ్గుతుంది. 23, 24 తేదిలలో మాంద్యము. 25న పుణ్యకార్య చింత. వారాంతమందు చలనము. ధనలోపముచే వ్యథ.

## *మృగశిర [వే, వో, కా, కీ]*

ఈ వారమున ఆర్థికమాంద్యము ఏర్పడుట చేతను కార్యభారము యెక్కువై ఖర్చులు పెరుగుటచేతనుమనస్సునకుఅస్థిమితము కలుగుతుంది. కోర్టువ్యవహారములలో కొంత అనుకూలత, కొంత ప్రతికూలత కలుగుతుంది. ఉద్యోగులకు వత్తిడి ఏర్పడుతుంది. అనారోగ్యము కలిగే సూచనలున్నవి. విద్యార్థులకు చదువుమీద శ్రద్ధ తక్కువవుతుంది. స్త్రీలతో వివాదాలు వస్తవి. ఇచ్చిపుచ్చుకొనేచోట్ల అసంతృప్తి. 23, 24 తేదీలలో తొందరపాటు; 25న మాంద్యము. 28,29 తేదీలలో చాంచల్యము.

## * ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] *

మీరు మీవారివల్ల ఆశించిన సహాయము సకాలములో పొందకపోవుటచేతను, అనుకున్న మిత్రులవల్ల కార్యములు నెరవేరకపోవుటచేతను ఆశాభంగము పొందుతారు. అయినను సాహసముతో మీ స్వశక్తిని ఉపయోగించుకొని మీకు కలిగిన తొందరలను ఎదుర్కొంటారు. ఆయుధాలవల్లగాని, అగ్నివల్లగాని ప్రమాదము కలిగే సూచనలున్నవి. జాగ్రత్తవల్ల కొంతవరకు తప్పించుకోగలుగుతారు. ఉద్యోగస్థులకు కార్యాచరణలో తొందర కలుగుతుంది. విద్యార్థులకు చదువుమీద అనాదరణ ఏర్పడుతుంది. 23, 24 తేదీలలో తొందరలు; 25వ ప్రమాదము కలిగే సూచన; 28, 29 తేదీలలో నిలకడ తక్కువ; ప్రయాణ సూచన.

## * పునర్వసు [కే, కో, హా, హీ,] *

ఈ వారమున సంఘములో మీ పలుకుబడి హెచ్చవుతుంది. స్వప్రయోజనముచే కార్యములను తృప్తికరముగా చేసుకుంటారు. మిత్రులను కలుసుకొనుట, సంతోషవార్త వినుట మొదలగు మంచి యోగములు కలుగును. శుభ కార్యములు జరిపే ఆలోచనలు చేస్తారు. విద్యార్థులు విజ్ఞానవిషయాలు నేర్చుకుంటారు. ఉద్యోగులకు అధికారులు అనుకూలముగా వుంటారు. కవులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము, వ్యాపారస్తులకు లాభము. 23, 24 తేదిలలో తొందరపాటు. 25న కార్యచింత. వారాంతమందు వ్యాపారస్తులకు ప్రయాణమువల్ల లాభము.

## *పుష్యమి [హూ, హే, హో, డా]*

గత కొద్దికాలమునుండి నెరవేరకుండా వుండిపోయిన కొన్ని కార్యములు ఈవారము మీకు అనుకూలముగా నెరవేరుతవి. మీరు కాంక్షించిన అధిక సహాయము తగిన సమయానికి చేతికి వస్తుంది. జీవితమునందు పనికివచ్చే ఎన్నో కొత్త సంగతులను పెద్దలవల్ల తెలుసుకుంటారు. సంఘములో మీ హోదా, గౌరవములు పెరుగుతవి. ఉద్యోగస్తులకు అధికారుల ఆదరణ వుంటుంది. భార్యాబిడ్డలతో సుఖముగా కాలక్షేపము జరుగుతుంది. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు.

## —ధరలు:—

నూలు, వస్త్రములు :—మార్పు లేదు. స్వల్ప తేడా.

నూనెదినుసులు: మార్పు వుండదు.

బెల్లము, పంచదార, చింతపండు :- నిలకడగా వుంటవి.

ఆహారధాన్యములు:-మందమై సులభముగా వుండును.

పప్పుదినుసులు: సమముగావుండును.

వెండి, బంగారము : నిలకడగా వుండును.

23, 24, 25 తేదీలలో విశేషముగా వర్షించును. ఆపైని అచ్చటచ్చటగాలితో కూడిన వానలు. మద్రాసునకు దక్షిణ ప్రాంతములో బాగా వర్షించును.

*  *  *

జన్మనక్షత్రమునుబట్టి గాని, జన్మ నక్షత్రము తెలియనివారు నామ నక్షత్రము (వారివారి పేర్లననుసరించి పేరు మొదటి అక్షరము)ను బట్టి గాని ఫలములను చూచుకొనునది. కృష్ణుడను పేరుకు మృగశిరానక్షత్రమును, విష్ణుడను పేరుకు స్వాతీనక్షత్రమును, శ్రీధరుడను పేరుకు చిత్తానక్షత్రమున్నూ, క్షేత్రపాలకుడనే పేరుకు హస్తానక్షత్రమును, జ్ఞానుడనే పేరుకు ఆరుద్రానక్షత్రమును, భీముడు భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢనక్షత్రమును చూచుకొనునది.

---

వ్యాపారస్తులకు లాభకరముగా వుంటుంది. 23, 24 తేదీలలో ఉద్రేకముగా వుంటుంది. 25 న గౌరవము. 28, 29 తేదీలలో ప్రయాణము కలిగేసూచనలు, ప్రయాసము. పండితులకూ, నటీనటులకూ కళాకారులకూ యోగకాలము.

### *ఆశ్లేష [డి, డూ, డే, డో]*

ఈవారము మీకు యోగదాయకముగా వుండుటచే యత్నకార్యములు ఫలప్రదముగా వుండగలవు. ఉద్యోగస్తులకు అధికారుల దయ కలుగును. మిత్రులతో వినోదముగా విందులలో పాల్గొంటారు. తూర్పు దిక్కునుండి శుభవార్త వింటారు. ధనాదాయము సకాలములో కలుగుతుంది. నూలు, బట్టల వ్యాపారస్తులకు అనుకూలముగా వుంటుంది. గాయకులకు, నటీనటులకు, కళాకారులకు యోగకాలము. 23, 24 తేదీలు కొంత శ్రమ; కార్యభారము హెచ్చు. 25 శుభయోగము. వారాంతమందు ప్రయాణము.

### *మఖ [మా, మీ, మూ, మే]*

ఈ వారము కవులు, గాయకులు మొదలగు కళాకారులవల్ల, బంధుమిత్రులవల్ల ఆనందము పొందుతారు. మాతృవర్గమునుండి మీరు ఆశించిన ధనసహాయము మీకు సకాలములో వచ్చుటచేత ప్రోత్సాహకరముగావుంటుంది. బంధువులతో మృష్టాన్నభోజనము చేస్తారు. ఉద్యోగస్తులకు తొందర లేకుండా సమముగా గడుస్తుంది. వర్తకులకు మేలు కలుగుతుంది. కవులకు, గాయకులకు, నటీనటులకు మంచికాలము. 23, 24 తేదీలలో మాంద్యము; 25-న వినోదవిలాసములు ; కోర్టు పనులలో అనుకూలము. వారాంతమందు చలనము.

### * పూర్వ ఫల్గుణి (పుబ్బ) *
### [ మో, టా, టీ, టూ ]

మీ ఆశయాలు సిద్ధించడానికి మీ రాబడి యెక్కువ చేసుకోడానికి మీరు చేసిన ప్రయత్నాలు ఫలించకపోవుటచే అశాంతి ఏర్పడుతుంది. కార్యభారము ఎక్కువ. అకాలభోజనమువల్ల ఆరోగ్యభంగ మేర్పడుతుంది. ఉష్ణాధిక్యముగా వుంటుంది. కోర్టువ్యవహారములో కొత్త సమస్యలు తలెత్తడంచేత మనోవ్యథ పొందుతారు. పితృవర్గమువల్ల ఆశించిన సహాయము కలుగకపోవడముచేత ఇబ్బందులు ఎక్కువయి గృహములో కలతలుకలిగే సూచనలున్నవి. విద్యార్థులకు చదువుసాగదు. ఉద్యోగులకు వత్తిడి ఎక్కువవుతుంది. 23, 24 తేదీలలో ఆశాభంగము; 25 న కొంత శాంతి; 26 అనారోగ్యం. 28, 29 సంచలనం.

### * ఉత్తర ఫల్గుణి (ఉత్తర) *
### [ టే, టో, పా, పి ]

ఈ వారము మీకు అనుకూలముగా వుండదు. అనుకున్న ఆర్థికసహాయము సకాలములో అందక, తలపెట్టిన కార్యములు నెరవేరక అశాంతి ఏర్పడే సూచనలున్నవి. నిందలపాలవుతారు. కాని కొందరు మిత్రులు వారాంతములో కలుగచేసుకొని నిలిచిపోయిన కార్యములు ముగియుటకు సహాయపడెదరు. మధ్యతరగతి ఉద్యోగులకు మొదట్లో అధికారుల ఒత్తిడి కలిగిననూ వారాంతమందు కొంత అనుకూలముగా వుంటుంది. ఆరోగ్యంగురించి శ్రద్ధఅవసరము. విద్యార్థుల చదువు తృప్తికరముగా సాగదు. 23 - 24 తేదిలలో ఆర్థికమాంద్యం; 25 కొంత సహాయము. వారాంతమందు సంచలనం. అనారోగ్య సూచన.

### *హస్త [పూ, ష, ణ, ఠ]*

ఈవారము అనుకున్న పనులు నెరవేరక పోవుటచేతను ఆశించిన సహాయము కలుగక పోవుటచేతను మనోవ్యథ ఎక్కువవుతుంది. పుణ్యకార్యభారమువల్లను జ్ఞానుల సాంగత్యమువల్లను ఓర్పుతో కార్యాచరణచేసి కొంత ఊరట పొందుతారు. కుటుంబమందుండువారికి ఆరోగ్యభంగము కలిగే సూచనలున్నవి. విద్యార్థులకు చదువుమీద శ్రద్ధ తగ్గుతుంది. 23, 24 తేదీలలో ఆశాభంగం; 25 న త్రిప్పట; వారాంతమందు కొంత శాంతి. 28, 29 తేదీలలో కుటుంబములో అనారోగ్య భయం.

### *చిత్త [పే, పో, రా, రీ]*

ఈవారము కార్యభారము అధికమవుతుంది. భరించలేని శ్రమ పొందినను అందుకు తగిన ఫలితము కలుగదు. అయిననూ ఓర్పు చూపుట మంచిది. కోర్టువ్యవహారములలో కొంత అనుకూలముగా కొంత ప్రతికూలంగా వుంటుంది. ఉద్యోగస్థులకు శ్రమవున్ననూ క్రమేణా అధికారులు మీవిలువను గుర్తించేటట్టు మీ ప్రజ్ఞను చూపగలుగుతారు. విద్యార్థులకు బద్ధకము హెచ్చుతుంది. దుష్టస్త్రీలతో వివాదంవల్ల మనోవ్యథ. 23, 24 తేదిలలో కార్యభారం. 26 న వివాదము. 28, 29 తేదిలలో లాభము లేని ప్రయాణము.

### * స్వాతి [రూ, రే, రో, తా] *

మీరు ఎంతో ఓపిక వహించి నిర్వహించిననూ కార్యాచరణలో శ్రమ అధికమై ఫలము లేకుండా వుంటుంది. అయిననూ నిరుత్సాహపడరు. ప్రయత్నములనూ విడవరు. అదే మంచిదిన్నీ, ముందుముందు మీకు జయమునిచ్చేదిన్నీ. గృహమందుండువారి ఆరోగ్యము సరిగాయుండక మధనపడతారు. సోదరవర్గమువల్ల సహాయమును పొంది కొంత తొందరలు కలిగించే అవసరాలను తీర్చుకుంటారు. అయినా డబ్బుగురించి ఇబ్బంది తీరదు. ఇచ్చిపుచ్చుకొనేచోట్ల చురుకు మాటలవల్ల మనస్సు గాయపడుతుంది. విద్యార్థులు వారిలో వారు పోటీపడతారు. ఉద్యోగులు శ్రద్ధ చూపించవలసివస్తుంది. 23, 24 తేదిలు శ్రమ. 25 ఆరోగ్యచింత. 26, 27 సోదరసహాయం. 28, 29 తేదీలలో వ్యయముతో కూడిన ప్రయాణం.

### *విశాఖ [తీ, తూ, తే, తో]*

ఈ వారం మిత్రులను కలుసుకుంటారు. సంతోష వార్త వింటారు. సంఘములో మీ పలుకుబడి హెచ్చుతుంది. స్వప్రయోజనముతో కార్యములను నిర్వహించి తృప్తి చెందుతారు. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. ఉద్యోగులకు అధికారుల ఆదరణ లభిస్తుంది. కవులకు, కళాకారులకు, నటీనటులకు మంచి కాలము. వ్యాపా

# నక్షత్ర ఫలితాలు

రస్తులకు లాభం. 23, 24 తేదీలలో ఎక్కువ త్రిప్పట. 25, కార్యచింత. 28, 29 తేదిలలో శుభకార్యముకొరకు ప్రయాణం.

***అనూరాధ [నా, నీ, నూ, నే]***

ఈ వారమున మీ ఆర్థిక స్థితి బాగుంటుంది. పండితుల సాంగత్యము వల్ల కొత్త విషయాలు తెలుసుకుంటారు. శుభ కార్యముల ఆలోచనలో కొంత జాగుకలుగుతుంది. కోర్టు వ్యవహారములు సంతోషకరముగా పరిష్కారము అవుతవి. విద్యార్థులు కొత్త సంగతులు నేర్చుకుంటారు. ఉద్యోగులకు గౌరవప్రదముగా వుంటుంది. వర్తకులకు లాభం. పండితులకు, కళాకారులకు, నటీనటులకూ యోగకాలము; 23, 24 తేదీలలో కార్యభారం; 25న శుభకార్య చింత, 28, 29 తేదీలలో ప్రయాణము.

***జ్యేష్ఠ [నో, యా, యీ, యూ]***

ఈ వారము మీకు అన్ని విధాల యోగకాలము. మానసిక స్థిమితము యేర్పడుట వల్ల నిర్ణయించుకున్న ఆలోచనల ప్రకారము కార్యసాధన జరిపి తృప్తిపొందుతారు. గత వారము మొదలుపెట్టి నెరవేరకుండా వున్న కొన్ని కార్యములు సులువుగా నెరవేరుతవి. ఉద్యోగస్తులకు హోదా ఎక్కువవుతుంది. వ్యాపారస్తులు కొన్ని మార్పులు చేసుకుని లాభముపొందగలరు పరిష్కారము కావలసిన కొన్ని వ్యవహారములు వివాదమువల్ల ఇంకా కొంతకాలమువరకూ వాయిదాపడుతవి. విద్యార్థులకు మేలుగా వుంటుంది. గాయకులకు, కవులకు కళాకారులకుమంచికాలము. 23,24 తేదీలలో శ్రమ, 25 న కార్యదీక్ష 27, 28, 29 తేదీలలో మార్పులు, ప్రయాణమువల్ల లాభము.

***మూల [యే, యో, బా, బి]***

ఈ వారము యోగకాలమగుటచేత మీరు చేసే ప్రయత్నాలు ఫలించి పరిస్థితులు సంతృప్తికరముగా వుంటవి. ధనాదాయము పెరుగుతుంది. సంఘములో హోదా ఎక్కువవుతుంది. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. కవులతోనూ, గాయకులతోనూ, స్త్రీలతోనూ, వినోదముగా గడుపుతారు. కోర్టు వ్యవహారములు అనుకూలిస్తవి. వ్యాపారస్తులకు ఆదాయము పెరుగుతుంది. ఉద్యోగులకు అధికారుల ఆదరణ వుంటుంది. 25 న వినోదము 26 న ఆరోగ్య చింత, 27, 28, 29 తేదీలలో ప్రయాణము, శుభవార్త.

***పూర్వాషాఢ [బూ, ధ, భ, ఢ]***

ఈ వారము మీకు యోగకాలము కాదు.

పితృవర్గమువల్ల మీరు అపేక్షించిన ఆర్థిక సహాయము సకాలములో పొందలేకపోతారు. ఎక్కువ శ్రమకలిగే పనులు చేసినను తగిన ఫలితము లేకపోవుటచేత మనోవ్యధ కలుగుతుంది. అకాల భోజనమువల్ల వేడిచేసి ఆరోగ్యము చెడే సూచనలున్నవి. కోర్టు వ్యవహారములలో ప్రతికూలతీర్పుల నెదుర్కొంటారు. ఉద్యోగులకు మంచికాలము కాదు. వ్యాపారస్తులకు ఒడిదుడుకులు ఏర్పడుతవి. విద్యార్థులకు చదువు శ్రద్ధగా సాగదు. 23, 24 తేదీలలో శ్రమ అధికము. 26 న అనారోగ్య సూచన, వారాంతమందు అస్థిమితము, చలనము.

## *ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]*

ఈ వారములో ఆర్థికస్థితి బాగుండకపోవుటచేతను, అనుకున్న కార్యములు సకాలములో నెరవేరకపోవుటచేతను మొదట్లో నిరుత్సాహము కలిగినను మిత్రుల సహాయమువల్ల కొంతవరకూ కార్యానుకూలత ఏర్పడుతుంది. వ్యాపారస్తులకు ప్రతికూల సూచనలు కనబడుతవి. ఉద్యోగస్తులకూ మొదట కలిగే తొందరలు క్రమేణా తోటివారి సహకారమువల్ల సర్దుకుంటవి. ఆరోగ్యమును గురించి జాగ్రత్త అవసరం. బద్ధకమువల్ల విద్యార్థులకు చదువు సక్రమముగా సాగదు. 23, 24 తేదీలలో కార్యవిలంబము. 25, 26 తేదీలు మిత్రసహాయం, ఆరోగ్యభంగం, 28, 29 తేదీలలో మార్పులు, ప్రయాణము కలిగే సూచన.

## *శ్రవణము [జూ, జే, జో, ఘా]*

ఈ వారము నిరుత్సాహముగా వుంటుంది. కావలసినడబ్బు అవసరానికి చేతికి అందకపోవుటచేతను కార్యవిలంబనము జరుగుతుంది. పుణ్యకార్యాచరణకొరకు ఎక్కువ శ్రమపడెదరు. జ్ఞానుల సాంగత్యమువల్లగాని పుస్తకపఠనమువల్లగాని ఊరట కలుగుతుంది. ఉద్యోగస్తులకువ్యాపారస్తులకుమంచికాలముకాదు. సంఘములో మీకు కలిగే ప్రతికూల వాతావరణమును ఓర్పుతో ఎదుర్కొని మీ వ్యక్తిత్వము నిలుపుకుంటారు. గృహమందుండువారి ఆరోగ్య విషయమై శ్రద్ధ తీసుకోవలసి వుంటుంది. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. 23, 24 తేదీలు ఆశాభంగము; 25, 26 తేదీలలో పుణ్యకార్యచింత. వారాంతమున లాభములేని ప్రయాణము.

## *ధనిష్ఠ [గా, గీ, గూ, గే]*

ఈ వారములో మిమ్మల్ని గురించి మీరే శ్రద్ధవహించడమెంతైనా అవసరం. ఆర్థికమాంద్యం ఏర్పడుతుంది. ప్రతికూల వాతావరణం ఎక్కువ. నీచస్త్రీలవల్ల నిందలపాలవుతారు. ఇచ్చిపుచ్చుకొనేచోట్ల వివాదాలు కలుగుతాయి. మీవల్ల నియమితమైన వారిమూలముగా కార్యసాధన కలుగుతుంది. విద్యార్థులకు చదువు సాగదు. వ్యాపారస్తులకు, ఉద్యోగస్తులకు ఒడిదుడుకులు ఏర్పడుతవి. త్రిప్పట ఎక్కువ. భార్యకు అస్వస్థత కలుగుతుంది. 23, 24 తేదీలు కార్యభారం; ఆర్థిక మాంద్యం; 25, 26 తేదీలు కార్యసాధన, 27 న వివాదములు; 28, 29, నిలకడ వుండదు.

## *శతభిషం [గో, సా, సీ, సూ]*

సోదరులవల్ల ఆర్థిక సహాయము పొందినను మీ అవసరములకు సరిపడకపోవుటచేత సర్దుబాటుచేయడంలో చాలా తికమకలు పడతారు. ఉద్యోగులకు అధికారుల పోటుమాటలవల్ల వ్యధ కలుగుతుంది. యంత్రములవల్లగాని, ఆయుధములవల్లగాని అవయములకు గాయములు కలుగవచ్చు. విద్యార్థులకు యేమంత మంచికాలము కాదు. వ్యాపారస్తులకు ప్రయాణమువల్ల కొంతలాభము కలుగుతుంది. 23, 24 తేదీలలో ఆర్థికమాంద్యం; 25 న సహోదర సహాయము, వారాంతమందు ప్రయాణము; అస్థిమితము.

## *పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] *

ఈవారమున మీ ప్రతిభచే కార్యసాధన సాగుటవల్ల తృప్తి కలుగుతుంది. అంతేకాకుండా మిత్రుల సహకారముకూడా ఎక్కువగా వుంటుంది. ఉత్తముల సాంగత్యము, ఉత్తమగ్రంథపఠనము మీకు ఆనందము కలుగచేస్తవి. బంధుదర్శనము, శుభవార్తాశ్రవణము మొదలగు ఫలములు గలుగును. ఉద్యోగస్తులు తోటివారి సహకారముతో అధికారుల ఆదరణను పొందుతారు. వ్యాపారస్తులకు లాభకరముగా వుంటుంది. విద్యార్థులు నూతనాంశములు నేర్చుకుంటారు. గణితశాస్త్రజ్ఞులకు, పండితులకు, కళాకారులకు, నటీనటులకు మేలు జరిగే కాలము. 23, 24 తేదీలలో కార్యదీక్షవల్ల అశాంతి; 25 మిత్రసహాయము, బంధుదర్శనము; వారాంతమున ప్రయాణము.

## * ఉత్తరాభాద్ర [దూ, శం, ఛా, ధా] *

అన్నివిధాల మీకు ఈవారము యోగకాలము. వృద్ధుల సాంగత్యమువల్ల జీవితములో ఉపయోగమునకువచ్చే అనేక రహస్యములను తెలుసుకోగలుగుతారు. గృహమందుండువారి సహకారముతో పనులను నిరాటంకముగా నెరవేర్చుకుంటారు. పిల్లల అభివృద్ధివల్ల సంతోషమును పొందుతారు. విద్యార్థులకు చురుకుగా చదువు సాగుతుంది. ఉద్యోగస్తులకు కాలము సుఖముగా గడుస్తుంది; వ్యాపారస్తులకు లాభయోగము. పండితులకూ, న్యాయవాదులకూ, నటీనటులకూ, కళాకారులకూ యోగకాలము. 25 న పెద్దల సాంగత్యము; 26 న శుభవార్త; 28, 29 తేదీలలో ప్రయాణమువల్ల లాభము.

## *రేవతి [దే, దో, చా, చీ]*

గత వారములో ప్రారంభమైన యోగము ఈ వారమున వృద్ధిపొందుతుంది. ఆర్థికముగా లోటు వుండదు. గాయకులతోను, కళాకారులతోను, మిత్రులతోను వినోదముగా గడుస్తుంది. మాతృవర్గమువారి సహాయము పొందుతారు. శుభకార్యములను గురించి ఆలోచనలు చేస్తారు. ఆప్తులతో మృష్టాన్నభోజనము ఆరగిస్తారు. కవితాగోష్ఠి జరుపుతారు. విద్యార్థులు నూతనాంశములను నేర్చుకుంటారు. వ్యాపారస్తులకు, ఉద్యోగస్తులకు సుఖముగా వుంటుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము. 25, 26 తేదీలలో ఆప్తదర్శనము, సంతోషము. 28, 29 తేదీలలో ప్రయాణము. ★

# దేవు నవ్వు

ఆర్.

పూజా మందిరంలో గంటలు గణ గణ మని మ్రోగాయి. సీతాపతిగారు దేవుడి విగ్రహం ముందు హారతిపళ్ళెం ముమ్మారు తిప్పి నేలమీద వుంచారు. చెంపలు వాయించుకుని సాష్టాంగ నమస్కారం చేశారు.

'ఆపద్బాంధవా!... శ్రీరామ చంద్రమూర్తీ! నిన్నే నమ్ముకున్న నన్ను ఇంకా ఎంతకాలం పరీక్షిస్తావు తండ్రీ!'

సామాన్యంగా భక్తుల నోటంట వచ్చే మాటలైనా ఆ పలుకులవెనక ఏదో విషాద గీతం ధ్వనించింది. శ్రీరాముడు మందహాసం చేశాడు.

చిన్నప్పటినుండీ సీతాపతిగారు భక్తి పూరితమైన వాతావరణంలో పెరిగాడు. ఆయన తండ్రి వూరువిడిచి వెళ్ళి వుద్యోగం చేయవలసిన అవుసరం లేకుండా పొలాల మీద మంచి రాబడివచ్చేది. కాలుమీద కాలు వేసుకుని జీవించారు. ఆయన దైవ భక్తి పరాయణుడు. ఉదయం నాలుగు గంటలకు లేచి దగ్గర్లోవున్న కాలవలో స్నానం చేసి వచ్చి అయిదు గంటలకు పూజా మందిరంలో అడుగుపెడితే భక్తిలో లీనమైపోయి ఏడుగంటల దాకా బయటికి వచ్చేవారు కారు. ఆయన అడుగుజాడల్లో పెరిగిన సీతాపతిగారూ అంతే—రైల్వేలో వుద్యోగం చేసినా ఆయన భావాలుకాని—ఆచార వ్యవహారాలు కాని మారలేదు.

కాని ఆయన ఆశించినందుకు విరుద్ధంగా శ్రీరాముడు చల్లటి తుషార బిందువుల్ని వర్షింపలేదు. అందుకు కారణం పెళ్ళీడుకొచ్చిన ముగ్గురు కూతుళ్ళు - పెద్దదానికి దరిదాపు ఇరవై ఏళ్ళుంటాయి. సంఘంలో నలుగురూ చేసే విమర్శకు తట్టుకోలేక సతమత మవుతున్నారు.

ఆయన భార్య వెండిగ్లాసు నిండా కాఫీ తీసుకొచ్చి స్టూలుమీద వుంచింది.

'ఇంకా నిద్రమత్తు వదల్లేనట్టే వుంది! సాఖర్మ కాకపోతే దానికి తగిన సంబంధాలు రాకపోతాయా! అయినా మీకు చీమ కుట్టినట్టైనా లేదు. అస్తమానం దేవుడు దేవుడు! అంతే! గొంతెమ్మ కోరికలు కోరుకుని ఏదో ప్రాప్తం అంటూ ఒకడి మెడకు కట్టేయక ఏవిటీ అపవాదు నాకు? చెప్పి, చెప్పి నా నోరు వడిపోతోందికాని...' అంటూ అందుకుంది.

ఆయనకు కాఫీ ఎలాదిగుతుంది!

'తెల్లవారగానే మొదలెట్టావు దండకం! ఇంక చాలించు... నేనూ చెప్పలరిగేటట్టు తిరుగుతూనే వున్నాను. ఇలాంటి సిగ్గో



భగ్న భాండం

చిత్రకారుడు: సిహెచ్. రాధేమోహన్.



# కనువిప్పు



లాంటి పిల్లల్ని ఎవరు చేసుకొంటాడు? ఓపిక పట్టాలిమరి' అంటూ కోపాన్ని అణచిపెట్టుకోడానికి యత్నించాడు.

సీతాపతిగారి ఆలోచనలు మరోదారిని పరుగెత్తాయి. నిన్నరాత్రి కలలో ఆయనకు శ్రీరాముడు కనిపించి ఆయన్ని నిందిస్తూ ఏవేవిటో అన్నాడు. కళ్లవెంబడి అగ్నికణాలు రాలాయి. అందుకు తను చేసిన అపరాధం ఏవిటి? ఏనాడూ పూజచేయకుండా వుండలేదే!

బయట అరుగుమీద జోళ్ళచప్పుడు వినబడింది.

ఎవరో నెమ్మదిగా మాటాడుకుంటున్న ధ్వని.

'సీతాపతిగారూ!' అన్న పిలుపు-

ఆయన వెంటనే గుర్తుపట్టాడు—అది డాక్టరుగారి కంఠం.

సీతాపతిగారు బయటకొచ్చి వినయపూర్వకంగా నమస్కరిస్తూ 'ఓహో!... ఏవిటిది! త్రిమూర్తులు కలిసి వచ్చారు! దయచేయండి' అంటూ ఆహ్వానించారు.

'పెద్దబిరుదే యిచ్చారండోయ్!' అన్నారు ఆ వూళ్ళో మంచి పేరుగడించిన ప్లీడరుగారు.

ముగురూ లోపలకొచ్చి మూడు నెలల క్రితంకొన్న 'స్టీల్ ఏజ్' మంచంమీద కూర్చున్నారు. గౌరవానికి లోటులేకుండా మూడు వెండి గ్లాసుల్లో కాఫీ తీసికొచ్చి వాళ్ళ ముందర వుంచింది ఆయన భార్య.

'ఊరకరారు మహానుభావులు!' అంటూ సంభాషణకు నాందీ వాక్యం పలికారు సీతాపతిగారు.

'ఆ...మీకు తెలియని విషయమేమీ కాదనుకోండి. మీరు రిటైరు కాకపూర్వం ఓమాటు యీవూరు వచ్చినప్పుడు అనుకున్న మాటే. చూడండి!... ఈ చుట్టుపక్కల మనం సుమారు ఎనిమిదివేల మంది వున్నాం—కాని దైవ సందర్శనం కోసం మైలుదూరం పోవలసి వుంది. అదెంత బాధకరమైందో ఆలోచించండి!' అన్నారు డాక్టరుగారు. వెంటనే పూజారి సుబ్బన్న అందుకున్నాడు.

'అందుచేత మన జనుల్లో దైవచింత బాగా సన్నగిలుతోందంటే నమ్మండి. ఇది చివరకు మన వినాశానికే దారితీస్తుంది.'

నిజంకావచ్చు—అందుకని?' అని అడ్డుప్రశ్న వేశారు సీతాపతిగారు.

'మరేంలేదు! చిన్న చిన్న నీటిచుక్కలు కలిస్తే సముద్రమవుతుందంటారు, అలాగే మనమంతా కలిసి దీక్షగా పూనుకుంటే ఓ బ్రహ్మాండమైన దేవాలయం నిర్మించవచ్చు.'

'అప్పుడది అందరికీ దగ్గరలో—సౌకర్యముగా వుంటుంది. మనలో ఒకవిధమైన నూతన తేజస్సు ఉద్భవిస్తుంది.' అని సమర్థించారు ప్లీడరుగారు. సీతాపతిగారు డబ్బు విషయంలో నిక్కచ్చిగా వుంటారు. అది ఆయనలో లోపం కావచ్చు. మౌనాన్ని ఏవిధంగా అన్వయించుకోవాలో అర్థంకాక ముగ్గురూ తికమకలాడారు.

'ఏవిటి ఆలోచిస్తున్నారు? మీ అభిప్రాయం ఏవిటి?'

'ఆ...ఏంలేదు. మనింట్లో దేవుడిపటం వుంచుకుని పూజచేస్తే చాలదా అని— ఇందుగల డందులేడను సందియము వలదన్నట్టు—అతను అన్నిచోట్లా వున్నాడు.'

పూజారి ఆయన్ని ముందుకు సాగనివ్వలేదు. నిజానికి ఆలయమంటూ వొకటి నిర్మితమైతే లాభంపొందేది సుబ్బన్న.

'నిజమే ననుకోండి—కాని అందరూ మీలాగ నిశ్చలభక్తితో దైవారాధన జరపగలరా? చంచలచిత్తుల్ని రుజుమార్గంలో వుంచటానికే దేవాలయాలు సృష్టింపబడ్డాయి. మనం అందరిబాగోగులు గమనించాలి.'

'అబ్బే!...మీ అభిప్రాయాన్ని నేను వ్యతిరేకిస్తున్నాననుకోకండి. ఇంతకీ నావలనయ్యే పెద్దసాయం ఏముంది కనక!'

'అదేవిటి? అలా వెనకాడుతున్నారు? దేవుడిపెళ్ళికి అందరూ పెద్దలన్నారు. ఇందులో మీకూ బాధ్యతవుంది.'

రెండునిమిషాలు నిశ్శబ్దం.

'చూడండి!...వరప్రసాదరావుగారు మూడువేలు చందా వేశారు. మీవంతు—' అంటూ అసలు విషయం బయటపెట్టారు ప్లీడరుగారు.

'అమ్మో!...అంతా వేలమీద నడుస్తోందన్నమాట! ఆ చాయలకు వెళ్ళటానికే నాకు తాహతులేదు.'

'అబ్బే!...మీరే అలాగంటే ఎలా? మొన్ననె రిటైరయ్యారు. అరవైవేలదాకా ప్రావిడెంటుఫండు వచ్చింది. మీరిలా చిన్నచూపువేస్తే ఆలయ నిర్మాణం మాటల్లోనే వుండిపోతుంది.'

ఆతరవాత పావుగంటసేపు సంభాషణ జరిగింది. ముగ్గురూ కలిసి సామదానభేద దండోపాయాలు ప్రయోగించి ఆయనచేత పదిహేను వందలు చందా వేయించారు.

'చందా వేశాంకదా ఇంక మనబాధ్యత వదిలిందనుకోకండోయ్! మీ సంపూర్ణ సహకారం కావాలి.' అంటూ త్రిమూర్తులు సెలవుతీసుకున్నారు.

ఆయనకొకవంక బాధగానే వుంది. అయినా దైవకార్యానికని తృప్తిపర్చుకున్నారు. ఒకవేళ ఇందుకే తన యిష్టదైవం నిన్నరాత్రి కన్నెర్ర చేసిందేమో!

'నాన్నా!...ఏంకూరలులేవు - ఇదుగో సంచీ. అమ్మ బజారుకెళ్ళి రమ్మంది.' అంటూ పెద్దకూతురు మాలతి ఆలోచనల్ని తుంచివేసింది.

మాలతివంక చూస్తుంటే కళ్ళు చెమ్మగిల్లాయి. స్త్రీకి - అందులోనూ యువతికి సౌందర్యాన్ని ప్రసాదించే ప్రతిలక్షణమూ ఆమెలో లోపించింది. మొదటిది శరీరచ్ఛాయ - అమావాస్యనాటి చీకటిలాంటిది. అందమనేది కళ్ళల్లో వుంటుందనుకుంటే అక్కడే శ్రీరాముడు అన్యాయం చేశాడు. మెల్లకన్ను ప్రసాదించాడు. ఆపరేషన్ చేసి సరిచేయమని శ్రేయస్కాములు సలహా యిచ్చారుకాని ఆయన భయపడి వూరుకున్నాడు. మూడోది అవయవ నిర్మాణం. మరో శరీరానికి వుద్దేశింపబడిననడుం - సన్నగా ములక్కాడల్లే వేలాడే చేతులు-ఏదో అర్థంకాని వ్యాధిచేత పీడింపబడుతూ వికసించని యౌవనం - పోనీ సహజమైన బారెడుజెడ వుందా అంటే అదీ లేదు. ఇలాంటి అమ్మాయికి సలక్షణమైన మొగుడు ఎలా దొరుకుతాడు? ఇందులో ఎవర్ని తప్పుపట్టి నిందించటం? ఆయనకు డబ్బు వుండి ఏంలాభం? మానవశక్తి కతీతమైనప్పుడు కనిపించని ఏ దేవుడిమీదో భారం వేయటం మానవనైజం-

సీతాపతిగారు ఏవో కూరగాయలు బేరమాడుతున్నారు.

'నమస్కారమండి!' అంటూ పలకరించాడు వీరభద్రం-

'ఏమోయ్!...కులాసా?'

వీరభద్రం ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయుడు. నలుగురికీ నమస్కారాలు పారేస్తూ ఎలాగో బతుకుతున్నాడు.

'ఏదో తమ దయవల్ల-విశేషించి మీతో ఒకమాట చెప్పాలనుకుంటున్నాను. సాయంత్రం అమ్మాయిని చూసుకోటానికి పెదపూడినుంచి వస్తున్నారు. అవసరమైతే కబురంపుతాను. పెద్దలు మీరు దగ్గరవుంటే నాకెంతో బలంగా వుంటుంది. అదీకాక తమకు నా పరిస్థితులు కూలంకషంగా తెలుసు. నేనే యింటికి వద్దామనుకుంటుంటే మీరు ఎదురయ్యారు.' అంటూ వినయంగా నవ్వాడు.

'దానికేం భాగ్యం! తప్పకుండా వస్తాను' అన్నారు.

వీరభద్రం మాటలు తల్చుకుంటే ఆయనకు నవ్వొచ్చింది. అతని కూతురు చాలా బాగుంటుంది. చక్కగా సంగీతం పాడుతుంది. అట్టే చదువుకోకపోయినా తెలుగు పద్య కావ్యాలన్నీ చదువుతుంది. గజేంద్ర మోక్షంలో పద్యాలు తప్పు చెపుతూండగా ఆయనే స్వయంగా విన్నాడు. అలాంటి చక్కటి చుక్కకు సరైన భర్త దొరకటం తలకుమించినపనిగావుంది. అందుక్కారణం వీరభద్రం దరిద్రుడు కావటం – ఇటు తనకు సిరిసంపదలున్నాయి. కాని ఒక్కరికీ అందచందాలులేవు. 'దైవలీల' అంటే యిదే గామోలు! మరుక్షణం ఆయన మనోనేత్రం ముందు వో బ్రహ్మాండమైన దేవాలయం కనపడింది. గుడిగంటలు జయధ్వానాలుచేశాయి! హృదయం పులకరించింది. కళ్ళమ్మట నీళ్లు కారాయి.

*          *          *

సాయంత్రం నాలుగు గంటలు–

సీతాపతిగార్ని వెంటనే రమ్మని వీరభద్రం కబురు పంపాడు. సిల్కు చొక్కా తొడుక్కుని, జరీకండువా వేసుకుని ఠీవిగావెళ్లారు. వీరభద్రం ఆయన్ని ఆదరించి కూర్చోబెట్టాడు.

కాని... పెళ్లికొడుకును చూడగానే కోటి శూలాలు గుండెలోంచి దూసుకుపోతున్నట్టనిపించింది. అతనే!...సరిగ్గా నెలరోజుల క్రితం తన కూతుర్ని చూసుకోటానికి వచ్చాడు.

డొక్కున్నట్లు – ఆముదం తాగినట్లు ముఖకవళికలు ప్రదర్శించాడు. మాలతిలాంటి అపురూప సుందరిని చూచినందుకు తనకు వారంరోజులవరకూ నిద్రపట్టదనిపరోక్షంగా ఎవరితోనో అన్నాడట. వీరభద్రం సీతాపతి గార్ని వంటింట్లోకి తీసుకుపోయాడు.

'చూడండి! అబ్బాయి వున్నత భావాలు కలవాడు. మంచి ఉద్యోగంవుంది. అతనికి అమ్మాయి నచ్చింది...కాని మా పరిస్థితులు మీకు తెలియనివికావు. నేను స్థితిమంతుడిని కాను. కనీసంవెయ్యిరూపాయలైనా కట్నం యివ్వాలని అంటున్నారు.'

ఇంతలో మధ్యవర్తి అక్కడకు వచ్చాడు.

'ఏమిటి ఇంకా ఆలోచన? ఇలాంటి సంబంధం భూప్రదక్షిణంచేసినా ఇంకమీకు లభ్యంకాదు. అతనికి తల్లీ తండ్రీ వుంటే పదివేలకు తక్కువ కాకుండా కట్నం అడుగుతారు–' అని హితబోధ చేశాడు.

వీరభద్రం అతనిమాటలు వినీవిననట్లువూరుకుండి 'అందుచేత మీరే అతనికి నచ్చచెప్పి కట్నం తగ్గించాలి. అయిదు వందలకు మించి కట్నం కానీకూడా యివ్వలేను. అదైనా తల్లకిందులా తపస్సుచేసి సంపాదించాలి.' అన్నాడు.

'నువ్వుచెప్పేది చిత్రంగా వుందయ్యా! అతను నామాట వింటాడా?'

'ఎందుకు వినడు? తగిన రీతిని మీరే చెప్పగలరు.'

సీతాపతిగారు యిరకాటంలో పడ్డారు. కట్నాలు పుచ్చుకోవటం అంత సమంజసం కాదనీ – చదువుకున్నవాడు కనక గుణగణాలకే ప్రాధాన్యం యివ్వాలని, వీరభద్రం కుటుంబం పరువు మర్యాదలు కలదని వుపదేశించారు.

'అంతయిదిగావుంటే నేనడిగే కట్నం మీరేయిచ్చి ఆయనకు సాయం చేయకూడదూ? మీరు మంచి స్థితిమంతులుగా!' అని నిర్మొహమాటంగా అనేశాడు పెళ్ళికొడుకు. సీతాపతిగారు కొయ్యబారిపోయి రెండు నిమిషాలు అలాగే నిలబడిపోయారు. తరువాత జరిగినదానికి సిగ్గుపడుతూ ఇంటికి తిరిగివచ్చారు.

ఆరాత్రికూడా శ్రీరాముడు కలలో కనిపించి కోపంగా ఏవేవో అన్నాడు. మర్నాడు ఉదయం కాఫీతాగి తిన్నగా వీరభద్రం యిల్లుచేరుకున్నారు.

'ఆఖరుకు ఏమయిందయ్యా?' అనడిగారు.

'ఏముందండి! సంబంధం చెయిజారిపోయినట్టే! అయినా ఈకాలంలో కట్నాలు లేకుండా ఎవరుచేసుకుంటారు?' అని నిట్టూర్చాడు వీరభద్రం.

'లోకపుతీరు అంతేననుకో!......నిన్న రాత్రంతా ఆలోచించాను. డాక్టరుగారూ వాళ్ళూ ఓ దేవాలయం నిర్మించాలని ప్రయత్నిస్తున్నారు. అందుకు నాచేత పదిహేను వందలు చందా వేయించారు. కాని మాధవసేవకంటే మానవసేవ గొప్పదన్నారు. బ్రహ్మాండమైన దేవాలయం నిర్మించారనుకో దానివలన సామాన్యుడికి ఒరిగేదేమిటి? ధర్మకర్తలు స్వామి సొమ్ము ఫలహారం చేస్తారు. పూజారి లాభం పొందుతాడు. అందుచేత ఆ పదిహేను వందలూ నీకిస్తాను – మీ అమ్మాయి పెళ్ళి దివ్యంగా జరిపించు–ఇవేళ ఆ వూరు వెళ్ళి అన్నీ స్థిరపర్చుకునిరా–ఆలస్యం చేయొద్దు.'

సీతాపతిగారి హృదయం ఎంత విశాలమైనదో అంచనా వేయటానికి యత్నిస్తూ నోటమాటరాక వీరభద్రం అలాగే వుండిపోయాడు.

'ఈ సొమ్ము నేనిస్తున్నానని అనుకోకు – ఆ శ్రీరామచంద్రమూర్తి అనుగ్రహించాడనుకో–' అంటూ పదిహేను వందలూ యిచ్చారు.

'నిజానికి నీకొచ్చేబోయే అల్లుడే నాకు చక్కటి సమాధానం యిచ్చి నాకన్ను తెరచాడు. నాకు చేతనైంది మంత్రోక్తమైన పూజ వొక్కటే!'

వీరభద్రం చెమ్మగలిగిన కళ్ళతో కృతజ్ఞతా పూర్వకంగా ఆయనకు నమస్కరించాడు.

ఆరాత్రి కలలో శ్రీరాముడు నవ్వుతూ సీతాపతిగార్ని దీవించాడు. మాలతి పెళ్ళి కూడా వైభవంగా జరుగుతున్నట్లు కనిపించింది.

సీతాపతిగారు మాత్రం దాన్ని కలగా విశ్వసించలేదు. 

# ఉపాధ్యాయసమితి

ఉమాపతి మాస్టారికి బ్రహ్మాండమైన ఆలోచన లున్నాయి. ఈనాటి ఉపాధ్యాయుడిస్థితి చూస్తే ఆయనకి గుండె తరుక్కుపోతోంది. "ఏమిటి అన్యాయం?" అని ఆలోచించాడు. ప్రభుత్వమే కాదు, దేశమే గొడ్డుపోతుంది ఉపాధ్యాయుడు లేకపోతే! అలాంటి ఉత్తమమైన పనిముట్టు తుడుపు లేక తుప్పుపట్టిపడుంది! దానికి ఆలనా, పాలనా లేదు. తల్లీతండ్రీ లేని పాపలాంటివాడు ఉపాధ్యాయుడు. ఏశాఖ అయినా, ఎంత ఉత్తమమయిన శాఖ అయినా...ఏసిబ్బందీఅయినా ఉపాధ్యాయుడు తయారుచేసి వదిలిన వస్తువ. ముడివస్తువును అనుభవించేదిగా తయారుచేసే శ్రామికుడికి తిండిలేదు! హారహారా! ఇదేమి వింత! ఉపాధ్యాయ వృత్తి అంటే అణువు మొదలు బ్రహ్మాండంవరకూ లోకువేనా!

సోదర ఉపాధ్యాయులతో ఈ విషయమే

**సీతాదేవి**

చెప్పాడు. "మనకు అన్యాయం జరుగుతోంటే వెర్రిబాగమ్మల్లా చూస్తూ ఊరుకున్నాం. ప్రపంచంఅంతా ముందుకు సాగిపోతున్నది. మనం మందంగా వెనకబడి ఊరుకోవడానికి వీల్లేదు. మనది బ్రహ్మాండమైన సంస్థ. మనకి కావలసినంత బలగముంది" "అవును! అవును!" అని అంతా అన్నారు.

ఇంకా అన్నారు ఉమాపతిమాస్టారు వళ్లు జలదరించేమాటలు. "అమ్మ పెట్టకపోతే అమ్మచేత మనమే పెట్టించుకు తినాలి!"

"అలాగే మరి!" అని దాసుమేస్టారు అన్నారు.

"ప్రతీసంస్థకు ఒక సంఘంలాంటిది ఉంటేది, సంఘ బలమును కూర్చి వేరే మెచ్చటించక్కర్లేదు. సంఘంద్వారా మన కోర్కెలను మనం సాధించగలం. ప్రస్తుతం మనం సుసంఘటితమైన ఒక సంఘం ఏర్పరచుకో



మెరుపు తీగకు వెలుగు పూవులు

ఫొటో: వి. కేశవశర్మ

#  ఉపాధ్యాయ సమితి 

తారా!"

"అలాగే కానీయండి!" అన్నారు నాగభూషణంగారు.

శివమూర్తి కన్నుమన్నాడు, "మనలో ఉన్నది అదే. ఎవడో కానిస్తే చూస్తూఊరుకొంటాం. పోస్టల్ డిపార్టుమెంట్ పెద్ద భారీ ఎత్తున సమ్మె సాగిస్తుంటే మనం చూస్తూ ఊరుకున్నాం. మనకు కనువిప్పు కలుగలేదు. దానికి బలవత్తరమైన సంఘం ఉంది అనుకొన్నాం. అంతేగాని మనంమాత్రం ఎందుకు మన కోరికలను నెరవేర్చుకోరాదూ అనే ప్రశ్న కలగలేదు, వాళ్ళు చేస్తున్నారనే ఏడుపు తప్పితే" శివమూర్తిగారు కోపంతో కళ్ళజోడు తీసి, అటూ ఇటూ చూసి అన్నారు. నాగభూషణంగారుకూడా ఏమంత తక్కువవారు కాదు. ఆయన, శివమూర్తి వదిలిన 'చేంతాడు'ను గభాలున అంది పుచ్చుకున్నట్టు..."అక్కడే వస్తుంది నాకు తలనొప్పి వాళ్ళు చేస్తున్నారనే ఏడుపు మాకెప్పుడూ లేదు. కాని వాళ్ళు చేస్తున్నది అన్యాయం అనిమాత్రం అనగలను" సభవంక ఒకమారు కలియచూసారు. సభ చూపులు... "ఇంకా పొడిగించు. బాగుంది" అన్నట్లున్నాయి.

"ఈ విషయంలో నేను ప్రభుత్వంతో ఏకీభవిస్తున్నాను. వాళ్ళకి ముట్టే జీతాలకు మన జీతాలకు సాపత్యం ఉందా? వెధవది... మనముందుపుట్టి పెరిగిన, వాడెవడూ?... తాడి సుబ్రహ్మణ్యం...పోస్టాఫీసులో గుమాస్తాఅయ్యాడు. మన్ని మించిపోయాడు. నిన్నకాక మొన్న స్కూలుఫయినల్ ప్యాసయిన వాడు నూరు నూటపది తెస్తుంటే...పదేళ్ళ సర్వీసు ఉన్నా, స్కూలుఫయినల్ చదివి, రెండేళ్ళ ట్రయినింగయినా ఎనభైదాటరు, ఏమిటీ అన్యాయం అంటాను. వాళ్ళు కీలకశాఖలో ఉన్నారని...ప్రతీ విషయానికీ ప్రభుత్వాన్ని బెదిరింపే!" అని మరోమాటు సభను చూచి నాగభూషణంగారు కూర్చున్నారు.

శివమూర్తి తిరగతోడాడు విషయాన్ని. "నాగభూషణంగారు చెప్పిందాంట్లో సత్యముంది. వాళ్ళ జీతాలకు, మన జీతాలకు ఎంతో తేడా ఉంది. ఒప్పుకుంటాను, 'వాళ్లు తీసుకోనే బాధ్యత, మనబాధ్యత దృక్పథంలో పెట్టుకోరేం? అది మన కక్కర్లేదనుకుంటాను."

వెంటనే కృష్ణమూర్తిగారు "బాధ్యతకే అంత తేడా చూపడం - కొంచెం కష్టంగానే ఉంటుంది సుమండీ! అయినే "బాధ్యత తప్పితే, పనిని దృష్టిలో ఉంచుకోరులా ఉంది శివమూర్తిగారు. "సభ ఫకాలుమంది. కృష్ణమూర్తికి ఎంతో ఉత్సాహాము వచ్చింది. ఒక 'బక్క' చెణుకును కూడా విసిరారాయన.

"మన ఉపాధ్యాయుడు వందేళ్లు బతికేది ఏభై ఏళ్ళకంటె ఎక్కువ బతికేవాడు. అందుకే కాబోసు, దీనికి ప్రమోషనులాంటిది లేదు." సభ మరోమాటు గొల్లుమంది. శివమూర్తి తాను క్రిందకు త్రోసివేయబడుతున్నట్లు గమనించి వెంటనే అందుకొన్నాడు.

"నేను పోస్టల్ వాళ్ళు చేయబోయిన సమ్మెను సమర్థించడానికి ఇక్కడకురాలేదు. వాళ్లు చేయగలుగుతున్నారు అంటే వాళ్లకి బలం ఉంది. మనం చేయలేం. మనం చేయలేనిది వాళ్లు చేస్తున్నారని మనకు దుగ్ధ"

"నాకు అక్కడే వస్తుంది." అని ఇంకా ఏదో చెప్పబోయాడు నాగభూషణం.

"మీకు ఎక్కడున్నా వస్తుంది. అక్కడే కాదు. కూర్చోండి..." అనబోయాడు శివమూర్తి. సభ మరోమాటు గొల్లుమంది. నాగభూషణం అభిమానపడ్డాడు. వెంటనే... "శివమూర్తిగారూ! మీకు ఔచితి...అనౌచితికూడా తెలియదు."

విషయం చాలా దూరం వెడుతున్నట్టు ఉమాపతి గ్రహించి "అయ్యలారా! మనలో మనం ఇలా కీచులాడుకోవడం తగదు. మనకు అనేక సమస్యలున్నాయి. వాటిని సంఘీభావంతో ఎదుర్కోవాలి. మనం ఒకందుకు వచ్చాం. అది మర్చిపోయి...వేరొక విషయాన్ని స్పృశించాం దురదృష్టవశాత్తూ!"

"అలాగే మరి!" అన్నారు. ఆగ్నేయ వర్మగారు.

"అలాగే కాదు. రెండు ముక్కలు చెప్పండి" అన్నాడు డ్రిల్లు మాష్టారు సదానందం.

"ఇదేం డ్రిల్లు కాదు!" అన్నారు ఆగ్నేయవర్మగారు.

"లెక్కలూ కాదు. 'హోమ్ వర్కు'లో 'స్కూలు వర్కు' చెల్లు!!" అన్నాడు సదానందం. బక్కచిక్కిన లాల్చీలు కిసకిసమన్నాయి!

హిమబిందుగారు లేచారు. ఆయనకొంత భావకవి.

"చూశారా! మన సోదరోపాధ్యాయులలో ఉన్న మొదటి లోపం ఇది. ఒకరంటె ఒకరికి పడదు. ఒకరి మాటపై మరొకరికి హితవు ఉండదు. వీరందరికీ ఐకమత్యం కుదరాలి. అది కుదిరితే, అడవిలోని కాయ, సముద్రపు ఉప్పు కలిపిన ఆవకాయవలె పసందుగా ఉంటుంది." అని కూర్చొన్నారు.

వేదమూర్తిగారు మాట్లాడబోయారు. ఆయన రాజకీయ బాధితుడు. జైలుకు వెళ్ళాడు. లాఠీదెబ్బలు తిన్నాడు. అవి ఆయన "క్వాలిఫికేషన్సు". ఐదెకరాలు పుచ్చుకున్నాడు. ఉపాధ్యాయవృత్తి. ఏదో 'కాలక్షేపం'గా చేస్తున్నారు. ఆయన అన్నారు గద్గదస్వరంతో...

"సోదరులారా! మనం సమావేశం అవడానికి, శ్రీ ఉమాపతిగారు మన్నిక్కడికి రప్పించడానికి గల కారణాలు మనకు తెలుసు. మన కోర్కెలు కనీసమైనవి. న్యాయసమ్మతమైనవి. ఇది మనకే కాదు, ప్రభుత్వానికీ తెలుసు. మన చేతివేళ్ళు ఐదింటిలోనూ, దేనికి ముల్లు గుచ్చుకున్నా మనం బాధపడతాం. అలానే ప్రభుత్వం కూడా, ఏశాఖలోనివారు బాధపడుతున్నా క్షోభిస్తుంది. అసలే మన ప్రభుత్వం ఆర్థికంగా వెనకబడుంది. ఏతండ్రి తన పిల్లలకు మంచి ఆహారం, మంచి గుడ్డ, మంచి విద్య ఇప్పించాలని చూడడు? తల్లికి బలహీనుడైన కుమారుడిపై ఎక్కువ ప్రేమ ఉంటుంది. అలాగే ప్రభుత్వానికి ఉపాధ్యాయసమితిపై ఎంతో ప్రేమవుంది. ఆర్థికపుష్టి రాగానే ప్రభుత్వం తగినంతసహాయం ఉపాధ్యాయుడికి చేస్తుందనే దృఢవిశ్వాసం నాకుంది. పోతే, ఆర్థికంగా వెనకాడుతున్న ప్రభుత్వానికి, మనకోసం బాధపడుతున్న ప్రభుత్వానికి, మనకై బెంగపెట్టుకొని, గాయపరుచుకొన్న ప్రభుత్వానికి, మనం సమ్మెలు మొదలయినవిచేసి మరికొంత బాధను కలగజేయడం ధర్మమే నా? పైగా అందరి ఉద్యోగాల్లాంటి ఉద్యోగముకాదు మనది. అత్యుత్తమమయినశాఖ మనది. క్షమకు మనం పెట్టిందిపేరు. భావిభారతనిర్మాతలయిన మన బాలబాలికల రూపురేఖలు దిద్దే మనమే సమ్మెలు చేసి విప్లవాత్మకముగా తయారైతే, ఇక విద్యార్థులు ఎలా తయారవుతారో యోచించండి. ప్రభుత్వం ఉప్పు తింటూ, ప్రభుత్వానికే ఎసరుపెట్టే యీ చెడుబుద్ధి మనకు ఎక్కడనుంచి సంక్రమించిందని విచారించాలె! బుద్ధదేవుడు పుట్టిన దేశం మనది. మన జాతిపిత బాపుజీ! మన ఔన్నత్యాన్ని ఖండాంతరాలలో చాటే నెహ్రూను దృష్టిలో పెట్టుకొని మనం ఏ పనినైనా తలపెట్టాలె!" అని కూర్చున్నారు.

రాజలింగం వెంటనే నుంచొని "శ్రీ వేదమూర్తిగారు చెప్పినమాటలువింటే, నేనిక్కడున్నానా అనే అనుమానం నన్ను ఇంకా వదల్లేదు. ఆయన మాటల్లో ఎంతో సత్యంవుంది. కాని ఒకటి. ప్రతి ఉపాధ్యాయుడూ, శ్రీ వేదమూర్తిగారిలా ఎల్లాగో అల్లాగ రాజకీయ బాధితుడై,

ఏదో శాస్త్రం కూస్తూ, సంపాదించితే, అచ్చు వేదమూర్తిగారిలా మాట్లాడగలరనే విశ్వాసం నాకుంది!" అని కూర్చున్నారు. సభ గలగలమంటూ నవ్వుతూ మెలికలు తిరిగిపోయింది. వేదమూర్తి "ఖద్దరు జేబురుమాలు"తో మొహంతుడుచుకున్నారు.

దాసు మాస్టారు లేచినుంచున్నారు. సభ నిశ్శబ్దంగా ఉంది. "మనం వాదోపవాదాలాడుకోవడానికి అయితే దానికి ఒక ప్రత్యేక సభ ఏర్పరచవలసిన అవసరం శ్రీ ఉమాపతి మాస్టారికి ఉండదు. ఏమైనా నేను రెండుముక్కలు అనుకుంటున్నాను. అవి మనవిచేస్తున్నాను. మనం విధికివశులం. గిలగిలా తన్నుకున్నా బయటపడేది సున్న. ఈ జీవిత నాటకరంగంపై మనకు పాత్ర నిర్దేశింపబడింది. దాన్ని ఆడితీరాలి. ఆడతాం. మనం వేరేత్రోవ త్రొక్కదామన్నా మన తాపత్రయమే మిగులుతుంది. అంతే! జరిగేది జరిగితీరుతుంది. మన సమస్యలు ప్రకృతికి వదిలేయండి. రోజులు దొర్లుతోంటే అవే పరిష్కరింపబడతాయి."

రాజలింగం లేచాడు. "ప్రతీవార్ని ఖండించడానికే లేస్తున్నాననుకుంటూరు. అది యథార్థంకాదు. యథార్థం మాట్లాడితే అది ఖండనలా ఉంటుంది. నేను ఎవర్నీ ద్వేషించను.

ఇప్పుడు దాసుమేస్టారు చెప్పేది నిజం కావచ్చు. నిజం కాకపోవచ్చు. అది తేల్చి చెప్పే సాహసం నాకులేదు. కాని ఒకటి నిజం. మనవాళ్ళు అంటూరు నాలుగు వేళ్ళూ నోట్లోకిపోతే వేదాంతం బాగా అలవడుతుందని. దాసుమాస్టారికి అదృష్టం మీద అభిమానం ఉండడం సహజం. ఆయన ఏనాడూ ఊహించి ఉండడు తనకంత అదృష్టం పడుతుందని. అందుకే ఆయనకు ప్రకృతిపైన, కాలంమీద నమ్మిక! ఆయన దత్తుడు! బాగా డబ్బుంది. డబ్బులేకపోవడమంటే ఆయనకు ఆశ్చర్యంగా ఉంటుంది. వెధవది! దానికోసం సమ్మెలా అని కూడా అనిపిస్తుంది. నేను చెప్పేది ఏమీ లేదు. చెప్పలేను కూడా! కాని ఇతరులుచెప్పే దానిపై మాట్లాడగలను. అంతే! కాలాతీతం అయిపోయింది. ఉమాపతిగారే నాల్గు ముక్కలు చెపితేమంచిది." అని కూర్చున్నారు.

ఉమాపతి మాస్టారు చెప్పడం మొదలు పెట్టారు. "కాలాతీతం అయింది. ఇప్పుడు మన సోదరులు చెప్పినదంతా పొల్లుక్రింద, కాలహరణం క్రింద నేను జమకట్టను. అందులో ఎంతో అర్థం పొదగబడిఉంది. ఇలాంటి అమూల్యమయిన విషయాలు గ్రహించగలిగిన అవకాశం కలిగినందుకు నేను సంతోషిస్తున్నాను. పదిమందీ పదిరకాలుగానూ చెప్పారు. ఇవన్నీ కలగాపులగంగా వున్నాయి. వీటినన్నీ ఏర్చి కూర్చాలి. మనం ఏంచేయాలో మనకు తోచకుండావుంది. ఇంతటితో నేటి సమావేశం ముగించేస్తే మంచిదనుకుంటూను. మనం ఒక నిర్ధారణకు వస్తేనేగాని ప్రధానోపాధ్యాయులను కలుసుకోనడం అవసరంకాదని నేనఅనుకుంటూను. మన నిర్ణయం మనం చేసుకోవడం కష్టంగా వున్నట్లుంది. దానికై ఒకరిసలహా తీసుకోడం అవసరంగా భావిస్తున్నాను."

"అవును" అన్నారు అంతాఏకగ్రీవంగా!

"అయితే ఎవరిసలహా అన్నది ప్రశ్న వస్తుంది. వయస్సు మళ్ళినవారు, లోకానుభవం కలిగినవారు, అనేక సంవత్సరాలుగా ఉపాధ్యాయపదవి నలంకరించి'రిటయిరయి'న



హారిచక్రం!
ఫొటో: శ్రీపాద వెంకన్న.

వారు బసవపున్నయ్యగారున్నారు. ఆయన మీద మీకూ, నాకూ కూడా గౌరవమున్నది. మనం చేసే నిర్ణయాలు కొంత ఆవేశపూరితంగా వుండొచ్చు. ఎందుచేతనంటే మనం దురవస్థలో వున్నాంగనక. బురదలో పడినవాడికి బయటపడ్డం ఎలాగో తోచదు. గట్టుమీదున్నవాడు సలహా, సునాయాసంగా చెప్పగలడు. ఆయనను రప్పించడం అందరికీ సమ్మతమే అనుకుంటూను."

"సమ్మతమే" అన్నారంతా!

ఆయనను కలుసుకున్న తర్వాత సమావేశమవవలసిన తేదీ తెలియచేస్తాను. మన కోర్కెలు తీర్చవలసినదిగా, మనసంఘం సుసంఘటితమైనదై ఉండవలసినదిగా, ఆతేజోవంతమైన తేజాన్ని ప్రార్థిస్తూ ఇంతటితో నేటి సమావేశం పూర్తయిందని తెలియజేస్తున్నాను."

ఎవరిఇళ్ళకు వాళ్లువెళ్ళిపోయారు రొదగా!

మరి రెండురోజులకు బసవపున్నయ్యగారి అధ్యక్షతను సభ జరిగింది. ఆయన ఇలా అన్నారు: "అయ్యలారా! మీరు నామీద ఇంత ఆదరణచూపడం నిజంగా నేను గర్వించదగనే. నేనూ ఉపాధ్యాయుడనే. ముప్పది ఏళ్ళపైన ఉపాధ్యాయుడుగా పనిచేశాను. ఉపాధ్యాయుడి కష్టసుఖా లేమిటో నాకు పూర్తిగా తెలుసు. మీరు ఇప్పుడు తీర్చుకోబోయే సమస్యలు ఏమీ కొత్తవికావు. ఇవి ఎప్పటినుంచో అలాగే పడివున్నాయి.మనకు అంగబలం కావలసినంతవుంది. ఇంత సిబ్బంది ఏశాఖలోనూ వుండదు. ఇది అత్యుత్తమమైన శాఖఅని అందరూ చెపుతారు నిజమే. కాని అన్నిశాఖల 'చైను' లోనూ ఇది అతిబలహీనమైన 'లింకు'. దీనికి గట్టితనం కలిగించాలని కలిగినభావన నిజంగా సంతోషించతగ్గదే.

మీకు క్రియాత్మకమైన ప్రోత్సాహం లభించకపోయినా ప్రజాదరణ, జాలి వుంటాయి. మీకోర్కెలు అతి కనీసమైనవని, మీరు కోరేవి, సామాన్యులు కోరే అతి ముఖ్యావసరాలని, అందరూ ఒప్పుకుంటూరు. కాని ఉపయోగాత్మకమైన పనిగాని, ప్రోత్సాహంగాని, బయటనుంచి లభించదన్నమాటమాత్రం వాస్తవం.

అయితే మీకు మీరే చూసుకోవాలన్నమాట. ఇది ఒకటి రెండు నూర్కెళ్ళ ఒప్పందంతో జరిగేదికాదు. సంఘీభావం కావాలి. అన్నిచోట్ల పంతుళ్ళందరూ కలియాలి. అప్పుడుమాత్రంసంభవమాఅంటే....అప్పుడు కూడా సంభవం కాకపోవచ్చు.

మనం ఒకనిర్ణయానికి వచ్చేముందు, దాని పూర్వాపరాలు కూడా యోచించాలి. చెప్పానుగా ... విద్యాశాఖ అన్నిశాఖల్లో అతి బలహీనమైనశాఖ. ఉపాధ్యాయులంతా సమైక్యమై సమ్మెలాంటిది తలపెడితే, (అటువంటిది జరుగకుండుగాక!) అది జయప్రదం అవుతుందనే నమ్మిక నాకు లేదు. ఇదేమీ, రైల్వే, తపాలాశాఖలవంటి శాఖ కాదు. పంతుళ్లు సమకట్టి, అంతా, సమ్మె కట్టినవాడు, అటు ప్రభుత్వంగాని, ఇటు ప్రజగాని నష్టపోయేది వీసమెత్తు ఉండదు. కొంతకాలం సమ్మె నిరాఘాటంగాజరగాలి. అది జరగడం అసంభవం. మీకు శక్తిలేదు.

అదికూడా జరుగుతుంది, జరిగితీరాలి, అని మీరంతా అంటె, మీ ఐకమత్యాన్ని, మీరు ఒకసారి పరీక్షించుకోండి" అని ఆయన కూర్చున్నారు.

ఉమాపతిగారు కలుగచేసుకొని ... "అయ్యా! మనం తలపెట్టిన కార్యం విప్లవాత్మకమైనదికాదు. అహింసాత్మకమైనది. మా ఐకమత్యంలో మాకు నమ్మకం ఉంది."

పున్నయ్యగారుచెప్పారు ... "మీ ఆవేశంలో కొండంతలు గోరంతలుగా కనపడుతున్నాయి. మీరు చేయబోయే మీ కోరికల

(56-వ పేజీ చూడండి)



"ఊరెల్ల రామభద్రుఁడు
ధారణి సేతకును బుష్టికిఁ
దల్లికి కౌసువున్
శ్రీరామ చంద్రుఁడయ్యెను
దారకమయ్యెను సమస్తధరణీ ప్రజకున్-"
(కల్పవృక్షము)

"ఏమే మనవరాలా, రాత్రే వచ్చాడు షా...మీ ఆయ నింకా కంటబడనే లేదేమే...ఎక్కడేనా దాచేశావా యేమిటి!" అంటూ బోసినవ్వుతో గుమ్మంలో యెదురయింది అమ్మమ్మ.

అప్పుడే పిల్లాడికిపాలిచ్చి పడుకోబెట్టి వచ్చిన ఉషాదేవి నవ్వుతూనే ఏసమాధానం ఇవ్వకుండానే దొడ్డివాకిట్లోకి నడిచేసింది.

తులసి కోటదగ్గరకూర్చుని అక్కయ్యలూ, అమ్మ ఏవో గుసగుసలాడుతున్నారు. తను వెళ్ళేసరికి అందరూ గప్‌చిప్‌గా ఊరుకుని, కూర్చునేందుకు చోటిచ్చారు. ఉషాదేవి మౌనంగా కూర్చుంది.

"ఏమేఅక్కా, బావగారు ఏమన్నారే?"

"అసలు బావకు కోపంవచ్చిందేమో!"

"అతనేం అలాటివాడు కాడు." అంది పెద్దక్కయ్య, చిన్న సిసింద్రిలనోరు కట్టేస్తూ.

"అబ్బో నీకు బాగా తెలుసనుకుంటాను" అని మూతిత్రిప్పింది సుందరి.

"దానికి తెలీకపోతే నీకేం తెలుస్తుందే?" అని బుగ్గగిల్లింది, దాని ప్రక్కనే ఉన్న జానకాలు.

"ఒసేవ్, నీకిదే ఆఖరిసారిచెప్పటం... అలా ఎప్పుడూ నాబుగ్గగిల్లకు" అని కోపంగా ప్రక్కకు తిరిగింది.

"ఛా నే దాని మొగుడొచ్చి చెయ్యాల్సిన పని నువ్వుచేస్తే..." అని రెండుబుగ్గలూ మెలిపెట్టింది అమ్మమ్మ.

"ఫో...అమ్మమ్మా...నువ్వెప్పుడూ యింతే. నేనసలు పెళ్ళేచేసుకోను" అని లేవబోయింది, అయిష్టంగానే.

"అంతేనే చెల్లీ...ఏమయినా సరే మనిద్దరం పెళ్ళిచేసుకోవద్దు. బావచెప్పాడు. ఉపనిషత్తుల్లోకూడా ఉన్నారుట పెళ్ళికాని పిల్లలు" అని గంభీరంగా కూర్చుంది.

అమ్మమ్మా, చెల్లాయిలూ చుట్టూ నాకేసి తలో మాటా విసిరేసరికి జ్వాలాతోరణంనాడు చీకటి జ్వాలల మధ్య చిక్కుకుపోయినట్లనిపించింది.

అసలే ఆయనతో మాట్లాట్టానికి సిగ్గుగా ఉంది. ఆయన రాని క్రితం క్షణంవరకూ ఎన్నెన్ని అనుకుందో...

అసలు పురుడొచ్చిందని తెలీగానే రెక్కలు కట్టుకువచ్చి వాల్తారనుకుంది. అలా జరక్కపోగా, రావటంలేదని వ్రాసిన ఉత్తరంలో కూడా ఆయన ముక్తసరిగా "ఏప్రియల్ పన్నెండువరకు ఊపిరి తీసికొనేందుకు కూడా తీరికలేదు" అనేసరికి గుండె గుభిల్లుమంది. ఈ ఆనందం ఆయనతో సమంగా పంచుకుని అనుభవించగల వారెవరున్నారు. ఆయనే అనేవారు. "అసలు జీవితంలో భార్య అనేది దుఃఖంలో భాగం పంచుకునేందుకు కాదు,

## ఉషశ్రీ

అది ఏ స్నేహితుడయినా పంచుకుంటాడు. పైగా ప్రపంచం దుఃఖానికి సానుభూతి ప్రకటించటానికి ఎప్పుడూ సిద్ధంగానే ఉంటుంది. కొందరు "మొసలి కన్నీరు" విడిచినా కొందరయినా ఆత్మతో అనుబంధం కలిగించుకుని యేడుస్తారు. అధికమైన ఆనందం కలిగినప్పుడు అందులో భాగస్థుడు కాగలిగినవాడే స్నేహితుడు. ఆ విషయంలోనే స్నేహితుడికంటె మరి కొంత అనుభవించగలుగుతుంది భార్య. మొగుడూ-పెళ్ళాల బంధం అందుకు."

ఈవాక్యాలు పెళ్ళినాడు ఆయన డైరీలో వ్రాసుకున్నారు. అవే నిన్నరాత్రి చూపించి:

"నీకిది జ్ఞాపకం ఉందా...అయితే నువ్వో ప్రశ్న అడగవచ్చు. 'ఈ విషయం యింత గాఢంగా తెలిసి ఉండి కూడా మీరెందుకు రాలేదూ, అని. బాబూరావూ, గోపాలం నన్ను రెచ్చగొట్టి ఆపేసారనీ- గోవిందరాజూ, భద్రం కలిసి తంతు సాగించారనీ అనుకుంటున్నావు. అదికాదసలు కారణం. నేను ఆరోజునే వచ్చేస్తే నీసంతోషం అంతా ఆ పూటతోనే ఆఖరు. ఇప్పుడు చూశావా! ఆ క్షణంలో కంటె ఎంత అధికంగా సంతోషంగా ఉన్నదో..."

అని చిబుకం పైకెత్తుతూంటే ఉక్కిరిబిక్కిరయిపోయేంత ఆనందం కలిగింది. ఆ ఊహ కలిగినా పులకలే ఎత్తుతూ ఉన్నది. ఏమిటో అంత సంతోషం. పెళ్ళినాడూ గుండె గుబగుబలాడింది. శోభనంనాటిరాత్రి నడుంమీదనుంచి చెయ్యిరానిచ్చి రెండు చేతులతోనూ పొదివి పట్టుకున్నప్పుడూ, పెదవి అందుకుంటూన్నప్పుడూ కలిగింది కానీ బిడ్డను చంక కెత్తుకున్నప్పుడు మాత్రం ఈ లోకానికి అతీతమయిన సంతోషం, అవాఙ్మానస గోచరమయినది కలిగింది. అదే బ్రహ్మానంద సహోదరానుభూతిఅయి ఉంటుందనిపించింది ఉషాదేవికి. అందుకే స్త్రీకి మాతృత్వం అంటే అంత కాంక్షయేమో...

ఆలోచించుకుంటూ కూర్చున్న ఉషాదేవికి చుట్టూరా చెల్లాయిలూ, అమ్మా, అమ్మమ్మా ఉన్న స్పృహే లేదు. ఏమిటో ఊహాలు దొర్లిపోతున్నవి. అంతూ పొంతూ లేకుండా సాగుతున్నదామె మనోమందాకినీ స్రవంతి.

అప్పుడే వాడి చదువూ-సంధ్యా నడిచిపోయినవి. అచ్చుపోసినట్టు వాడూ తనలాగే ఉంటాడుకనక మంచి పరికిణీలూ, గౌనులూ తొడిగి 'అమ్మాయీ' అనిపిలవాలి. కొత్తవాళ్ళెవరొచ్చినా అమ్మాయనే అనుకోవాలి. భోజనాలకు కూర్చున్నప్పుడు మాత్రం వాళ్ళు తెల్లబోయి, వెల్లనవ్వు నవ్వాలి.

అనుకోకుండానే ఆమెకు నవ్వొచ్చింది. "మళ్ళీ పిల్లకోసం కలగంటున్నట్టుంది మనవరాలు," అని ముసిముసినవ్వులు నవ్వింది అమ్మమ్మ.

"నువ్వెప్పుడూ అంతే అమ్మమ్మా," అని జువ్వలా లేచింది పెద్దచెల్లి.

"అసలు అమ్మమ్మకి పనేంలేదు," అని చీదరించుకుంది సిసింద్రీలా ఆఖరు చెల్లెలు.

"ఓయమ్మో! ఇలా కబుర్లు చెప్పినవాళ్ళే మొగుణ్ణి చెంగుకి కట్టుకు తిరుగుతారు. ఈ కళ్ళతో చూడకపోతానా యేమిటి...ఈ సిసింద్రీనుండ ఏడాదికి ఇద్దర్ని కనకపోతే. ఒళ్ళోపిల్లకి అయిదోనెలా, తల్లికి మూడో



"సెలానూ..." అన్నది అమ్మమ్మ.

"అదికాదమ్మమ్మా...తలికి అయిదో నెలా, పిల్లాడికి మూడో నెలానూ," అన్నాడు పెద్దమేనల్లుడు కాఫీ తాగుతూ వచ్చి.

"అంతేరా నాయనా...నీ తల్లికడుపు చల్లగా వజ్రంలాంటి మాట చెప్పావు!" అని మెటికలు విరిచింది అమ్మమ్మ.

"అక్కా, బావకు కాఫీ ఇచ్చావే," అని విసవిస వంటింటివైపు నడిచి చెంగు బొడ్డులో దోపింది చెల్లాయి.

"ఇంతకీ అత్తా, నామకరణం విషయం ఎంతవరకు వచ్చిందో," అన్నాడు కాఫీ గ్లాసు కింద పెడుతూ.

"దానికేం తెలుస్తుందిరా, ఆయనుండగానూ?" అని అడ్డుపలికింది అమ్మ.

ఆవిడకూ తెలుసుకోవాలనే ఉంది.

అసలావిడ అభిప్రాయం ప్రకారం చేయాలంటే అది పది పురుషాంతరాలు వెనకా - ముందూ కలుస్తుంది. అనంతకోటి నామాలూ కాకపోయినా కేశవా దగ్గర్నుంచి శ్రీకృష్ణాయనమః వరకూ మధ్యమధ్య మరి కొన్ని గ్రామదేవతల పేర్లతో ఓ తావు నిండుతుంది. అందుకే ఆవిడ కాగితం మీద వ్రాయించి పెట్టుకుంది.

"ఏమే అక్కా, బావగారేమన్నారే?" అని చెవికొరికింది. చిన్న చెల్లాయి.

"ఏవింటే, దానికేవన్నా చెవుడా ఏమిషే అదేదో పైకే అనరాదు షే?" అన్నది అమ్మమ్మ మహాకుతూహలంతో.

"నువ్వూరుకో అమ్మమ్మా...రామా... కృష్ణా...అంటూ కూర్చోక" అని ఎదురు తిరిగిన పిసింద్రీలా చీదిపారేసింది, బుల్లిది.



# అభిధ



"అదేమిటే...పెద్దదాన్ని పట్టుకు అలా తిసేస్తారూ..." అని సాగదీసుకుంది అక్కయ్య.

"అక్కా, బావ కాఫీ తాగడుటే" అంటూ గ్లాసు పొందిగ్గా పట్టుకువచ్చి నిలబడింది.

నిజంగా బావ త్రాగనన్నప్పుడున్న కళ దాని ముఖంలో లేదు. లేదు సరికదా గ్లాసు పట్టుకున్న విధానంలో నే గ్లాసు ఖాళీ అయినట్టు - కాస్తపూహిస్తే తెలిసేలా ఉంది.

పైగా దానిముఖంలో పొంగుతూన్న నవ్వు చెపుతున్నది అసలు విషయాన్ని.

"పోనేవే, ఇలా యిచ్చేయ్ నేనే తాగేస్తాను" అంది చెల్లి.

"ఇప్పుడు వస్తానే" అంటూ అందరి ఆశనూ నిరాశచేసి కదిలింది ఉషాదేవి.

"అబ్బో, అంతా గొప్ప" అంటూ కళ్లు గిరగిరా త్రిప్పింది బుల్లిది.

"అలాగేలే - ఇంకా నయం కాదూ... నువ్వసలు మొగుడి పక్కలోంచి కదుల్తావేమో చూస్తా..."నంటూ అమ్మమ్మ నూతి పళ్ళెంపైపు నడిచింది.

"ఏమోనమ్మా నాకేమీ పాలుపోవటం లేదు. ఇంతకూ అసలుపేరేం పెడతారో" అనుకుంటూ, చెంగుతో ముఖం ఒత్తుకుని లేచింది, అమ్మ.

## 2

"నాతో చెప్పవ్ బావా...ఏం పేరెడతావో?" అంది ఆ వార్తను తనే ప్రథమంగా ప్రసారంచేసే కీర్తిని దక్కించుకోవాలనే విలేఖరి మనస్సుతో, మరదలు.

నవ్వాడతను.

అతను నవ్వటంలో ఒక సొగసు.

ఆ సొగసులో ఎదుటివాళ్ళ మనస్సు కూడా శ్రుతి కలుపుకుంటుంది. అలా నవ్వినప్పుడు అతను సమాధానం యిచ్చే సంకల్పంలో లేడని యెదుటి వాళ్లందరకూ తెలీదు కానీ...ఎరిగిన వాళ్ళకు తెలీకపోదు.

"ఆ నవ్వే వద్దన్నాను." అంది, చాటుగా నిలబడ్డ చిన్న మరదలు.

"అలా అనకపోతే నువ్వుకూడా నేర్చుకోరాదుటే," అని చటుక్కున దాని బుగ్గ గిల్లాడు.

తుర్రుమంది మరదలు.

ప్రశ్నించిన బుల్లిమాత్రం తలుపుసానుకునే నిలబడి ఉంది.

అయితే దానికి సమాధానంకంటె అలా సంభాషణ పెంచటమే సరదా అని అతనికి తెలుసునని దానికి తెలుసు.

గడపదాటుతూ దాని బుగ్గమీద చెయ్యి వెయ్యబోయి తల ప్రక్కకు తిరగగా, జడ మెడ చుట్టూ విసిరి వెళ్లి కుర్చీలో కూర్చున్నాడు.

"ఫో బావా...అంతేనేమిటే?" అని కొచ్చగొట్టినట్టు పలికీ పలికి, గుండె గుబగుబలాడి ఓ—క్క అంగలో దగ్గరగా వచ్చి బుగ్గమీదనే పెదవులుంచినంత పనిచేశాడు. కానీ, మెదడులో ఏ మూలనో యిరుక్కున్న జ్ఞానం ప్రకోపించి ఛరాలున దాన్ని గదిలోంచి దాటించేసింది.

సరిగ్గా అదే సమయానికి చంటిపిల్లకు తలంటిపోసి పాలిస్తూ వస్తూన్న అక్కయ్యను గుమ్మంలో నిలబెట్టి,

"ఏం పేరే?" అంది.

"ఏమో నువ్వే అడుగు...నా తరవాయి నీకూ!" అని కోరగా చూచి నవ్వింది.

"మరిదేం అలాంటివాడు కాదులే. ఏమోయ్ అంతేనా?" ఒక్కొక్కళ్ళకొక్కలా ఉంటుంది. మీ దృష్టిలో నా అంతమంచి వాడు లేడు. దాని దృష్టిలో నా అంత సరదా అయిన వాడు లేడు. మా ఆవిడగా ఉన్న మీ చెల్లాయి దృష్టిలో నా అంత కోపిష్టి లేడు" అని సిగరెట్ ముట్టించాడు.

"మూడేళ్ళనుంచి చూస్తున్నాను కానీ, భగవంతుడడిగినా భావసలక్షణంగా సమాధానం చెప్పడు," అని పైట చెంగు సరిజేసికొని చిలిపిగా వెక్కిరించింది, అక్కయ్య చూడకుండా.

"లక్షణంగా చెప్పేస్తే కథసాగవద్దుటే?"

"అంతేలే...నీకు కథ పెరగటం కోసమేం దొరికాం!"

"నువ్వు కాకపోతే మరో సిసింద్రీ... అయినా ఒకటిలే..."

"ఏమిటో ఆ ఒకటి?" ఒయ్యారంగా పెదవులు తిప్పుతూ కన్ను లాడించింది.

"చెప్పనా ... చెప్పెయ్యనా ... చెప్తున్నా...చెప్పేస్తున్నా"అని గోడమూలకోడులో కాలుపెట్టాడు.

"అంతేనా...రెండూ యిచ్చేస్తే..."

"నువ్విస్తే ఎంత బావుంటుందో!" అని గుటకేసి చప్పరించాడు.

"ఒసేచెల్లీ...ఇక్కడ నిలబడి ఖబుర్లు చెప్పకపోతే..."

"నే నేంపని చెయ్యలేనే, కష్టపడి కన్న దానివి కావలసినవేవో చూసుకోలేవా?"

"మా బాగా అడిగావే!"

"సరిపోయింది బావా మరదళ్ళకు. చూడవే అక్కా దీన్ని, ఎలా ఎక్కిరిస్తోందో," అంది ఉషాదేవి కాళ్ళుజాపుకు కూర్చుని పిల్లాణ్ణి పొత్తిళ్ళలో ఉంచుకుంటూ.

"నీకన్న బావే నయం ఎంచక్కా ఉడుక్కోడు."

"తినిపించు...ఇంకా స్త గడ్డి తినిపించవే"

(55-వ పేజీ చూడండి)

# పెళ్ళిచూపులు

[శాంత పటాలకు పూలు పెడుతూ వుంటుంది. సరళ కూనిరాగం ఆలాపిస్తూ మరోపైపు ఫోటోలు చూస్తూ వుంటుంది......]

శాంత:-సరళా! సరళా!

సరళ:-.........

శాం:-నిన్నే నేవ్. సరళమ్మా...ఏం! నాన్న అలా పెళ్ళివారికోసం వెళ్ళారో, లేదో, తమరీ ప్రపంచాన్నే మరచిపోతున్నారే?

సర: ఉండవే అక్కా! నీదంతా మరిను...

శాం:-ఉండక పూరికిపోసుతే ... పదిన్నరగంటలబండీలో ఆ వచ్చే పెండ్లికుమార రత్నాన్ని తిలకించి, ఏమండోయ్ మరదులుంగారు జాగ్రత్త, మా సరళ... అసలే పెంకె ఘటం అని చెప్పి మరీ...

సర:- అమ్మా! అమ్మా! అక్కయ్య చూడవే!

జానకమ్మ:- (లోపలినుండి వస్తూ)... ఏమిట్రా మరీనూ...ఇదుగో శాంతా, యింకా పదిన్నర కాలేదా అమ్మా!

శాంత:-అయిందమ్మా! అయింది... అయినా అంత తొందరేమే తల్లీ కూతుళ్లకు. ఆ వచ్చేవారు రాక మానారా! తెల్లవారింది మొదలు యిద్దరూ కళ్ళు కాయలు కాచేలా దారి, గడియారం చూడడం చూడలేక మాపని అవుతోంది!

జానక:-పిచ్చి పిల్లా! నీకేం తెలుసమ్మా, ఆడపిల్లలున్న వారి బాధ. ఆ మూడుముళ్లూ సవ్యంగాపడేవరకూ గుండెలమీదకుంపటేగదమ్మా. నిన్న మొన్నటి వరకూ నీ పెళ్ళికి మేమెంత అవస్థలు పడ్డది నీకేం తెలుసు? అయినా నలుగురాడ పిల్లలు నీకూ పుడితే తెలిసొస్తుంది ఆ బాధ్యతా!

సర:- అంతే! అంతే! అక్కయ్యకు అందరూ ఆడపిల్లలే పుట్టాలి.

శాం:-నాకు ఆడపిల్లలు పుట్టేసంగతలా వుంచి ముందు నీవు. ముస్తాబై కూర్చో! మళ్ళీ వాళ్ళొచ్చే వేళయింది!

సర:- నే నేం ముస్తాబవ్వాలిసిన పనిలేదు. కావాలంటే నీవే తయారయి కూర్చో-

శాం:-నేనూ తయారవుతా! పెళ్లికూతురు అక్కగారు అంటూ నన్నూ చూస్తారుగా.

---

**పాత్రలు:**

- భుజంగరావు
- జానకమ్మ
- శాంత } సమవయస్కుల్లా
- సరళ } కన్పిస్తారు.
- వెంకట్రావు
- రామారావు
- రఘు
- సిద్ధాంతి.

---

జానక:-సరేకాని లోపలికెళ్ళి మొఖాలు కడుక్కొని టాయిలెట్ అయి సిద్ధంగా వుండండి. బండివేళ అయింది....

[భుజంగరావు కంగారుగా వస్తూ...]

భుజ:-ఇదిగో ... ఎక్కడా? ... ఆ యిక్కడే వున్నావా!

జాన:-ఏమిటండీ ఆకంగారు? ? ?

భుజం:-కంగారుకాదూ మరి. వాళ్ళొచ్చేస్తున్నారు. త్వరగా ఏర్పాట్లు కావాలి. ఊ! అర్జెంటుగా. ఇదిగో మరిచా! అమ్మాయి లేరి! ఆ! యిక్కడే వున్నారా! తల్లీ, శాంతమ్మా.

కొంచెంత్వరగా సరళను తయారుచేసి... మరిత్వరగా అంటే త్వరగా అన్నమాట... వాళ్ళు వొచ్చేస్తున్నారు.

జానక: మేమంతా సిద్ధమేనండీ! ఫలహారాలు, కాఫీఅన్నీ తయారయ్యాయి. ఇకమీ ఆలస్యమే! శాంతా! పదండి తల్లీ, మీరు సిద్ధంగావుండండి!

(శాంతా-సరళ వెళతారు.)

భుజంగ: ఇదుగో...మర్యాదకు లోటు చెయ్యకూడదు. వాళ్ళూ గొప్పవారు!

జానక: ఇంతకూ వాళ్లెరండీ!?

భుజంగ: వస్తున్నారు! బండి దిగ్గానే వాళ్ళకు తెలిసినవాళ్ళెవరో వుంటే, అలా వెళ్ళారు. బహుశా వచ్చేస్తూ వుంటారు.

---

నీలి గణేశన్

---

ఇదిగో మరిచా, వాళ్ళు అమ్మాయి సంగీతం వింటామన్నారు...సరే అన్నాను. శాంతను వయొలిన్ వాయించమను. 'సరళ' పాట పాడుతుంది.

జానక: అలాగేకాని...మీరు ఎదురువెళ్లి తీసుకురండీ!

[భుజంగరావు వెళతాడు...లోపలినుండే 'అమ్మా' అని పిలుపు.]

జానక: వస్తున్నా (వెళ్ళిపోతూవుండగా వెంకట్రావు, రామారావు, రఘు, సిద్ధాంతి వస్తారు. భుజంగరావుతో సహా.)

భుజంగ: దయచెయ్యండి!దయచెయ్యండి ఇదిగో...బావగారు వచ్చారు.

జానక: [వెనక్కు మళ్ళి చూచి...] సంతోషం... (త్వరగా వెళ్లుతుంది.)

[అందరూ కూర్చుంటారు.]

సిద్ధాంతి: శుభం అయితే భుజంగరావు గారూ! యీగృహం మనదేకదూ...

భుజంగ: ఏదోలెండి! తమ దయ. ఈ యిల్లు కట్టించి పది సంవత్సరాలవుతోంది. మనలాంటి కుటుంబాలకు యిలాంటి కొంపలన్నా లేకుంటే...అద్దెలెక్కడ భరించగలం చెప్పండి!

వెంక: అవునవును! మరీ బస్తీలలో కొంపల కొచ్చింది కొరతల్లా. అందెందుకు, మా రామారావు రఘు చదువులకు గుంటూరులో ఎంత డబ్బు అద్దెకు తగలేశామో! అందుకే మా పెద్ద వాడంటాడు. గుంటూరులో ఓ యిల్లు కొందామనీ...

రామారావు: అవునండి! మానాన్న వినిపించుకోరుకాని, యిప్పట్లో బస్తీలలో యిళ్ళుండటం యెంత అవసరమో! ఎలాగూ మన మెవరమో అక్కడ వుండటం తటస్థిస్తుందాయె!

భుజంగ: అవున్నాయనా!

వెంక: అయితే! అమ్మాయి యెంతవరకు చదివిందన్నారూ?

భుజంగ: ఏమి చదువులెండి! అమ్మాయిలిద్దరూ కలిసే తరుడుఫారమ్ వరకు చదివారు. అయినా [illegible] ట్టు సంగీతం చెప్పించాను...చక్కగా వయొలిన్ వాయిస్తారు. గాత్రం కూడ...

సిద్ధాంతి: అంతే, భుజంగరావుగారూ! కళాభిమానం వుండాలి కాని...ఈ వావా



# పెళ్లిచూపులు



కాలపు చదువు లెందుకులెండి! మాటవరసకు చెపుతా, వెంకట్రావుగారి అబ్బాయిలు మాత్రం చదివింది, బి. కామ్. అయినా తెలుగులో మంచి ప్రవేశం కలవాళ్ళు కదూ. పెద్దబ్బాయి రామారావు పత్రికలకు కథలు, విమర్శలు వ్రాస్తాడు కూడా!

భుజంగ: అలాగా? సంతోషం. ఆ మాత్రం సాహిత్య పిపాస వుండాల్సిందే! [లోపలివైపు చూస్తూ!] ఇదిగో...అమ్మాయిని త్వరగా తీసుకురా!

[శాంత, సరళలు ఫలహారాలతో వస్తారు.]

సిద్ధాంతి: ఇదిగో అమ్మాయి సరళ! వీదీమే మీ ఫలహారాలు పూర్తిచేసేటంతలో కమ్మని సంగీతం వినిపించమ్మా.

(శాంతి వయిలెన్ వాయిస్తుంది. సరళ పాడుతుంది.)

సిద్ధాంతి: (ఫలహారం పూర్తిచేసి) ఆహా, మధురగానం. చాలబాగుందమ్మా! ఏమంటారు వెంకట్రావుగారు???

వెంక: అవునవును. అయినా వాళ్ళ అభిప్రాయాలు ఎలావున్నాయో? (రామారావు రఘులను చూస్తూ)

రామారావు: నాకుమటుకు, సంగీతం చాల బావుంది!

సిద్ధాంతి: మరి రఘు ఏమంటాడు? (నవ్వుతూ)

రామారావు: వాడేమంటాడు. అసలే వయిలెన్ అంటే వాడి కెక్కడలేని అభిమానం...కాబట్టి వయిలెన్ బాగుందంటాడు...

వెంకట: అంతే బావగారూ! సెలవు ఇప్పిస్తే......

భుజంగ: ఏదో బావగారూ! మర్యాదలకు లోటు రానివ్వకుండా-అంతా సవ్యంగా అనుకొన్నట్లు పూర్తిజేస్తాను. నన్ను మాత్రం కృతార్థుణ్ని చెయ్యాలి.

వెంకట: దానికేముంది లెండి. ఎలా సర్దుకొన్నా సరిపోతుంది. ఎటొచ్చి అబ్బాయి అభిప్రాయం అంటూ ఒకటి వుందికదా! మన నిర్ణయాలు తర్వాతే. ఇక మాకు సెలవు...

[అందరూ లేస్తారు. బయటికి పంపిస్తూ...]

భుజంగ: అబ్బాయిగారి అభిప్రాయం త్వరలో తెలియపరిస్తే......

వెంకట: తప్పకుండానూ!

భుజంగ: మరి సెలవు తీసికొంటాను సిద్ధాంతిగారూ...

సిద్ధాంతి: శుభం...

[అంతా వెళతారు]

* * *

[తర్వాత మూడురోజులకు భుజంగరావు గారిల్లు, భుజంగరావు, జానకమ్మ వుంటారు]

భుజంగ: (పేపరు చూస్తూవుంటాడు)

జానక: ఏమండోయ్! మిమ్మల్నే. టపా వచ్చిందా?

భుజంగ: ఇంకారాలేదు. దానికోసమే ఎదురుచూస్తున్నా! అది సరేకాని, ఆ చిన్నదాని అభిప్రాయం చెప్పిందా!

జానక: అయ్యో! ఖర్మ ... నాకు చెపితేనా...యేంపిల్లో, యేంకథో. మనసులో మాటచెపితేనా! అడిగీ అడిగీ, నానోరు పడిపోతోంది.

భుజంగ: ఆ నేరమంతా మరీనూ! అదీ చిన్నపిల్లా. బుజ్జగించి అడగాలికాని, పదిమంది ముందర వేళాకోళంగా అడిగితే అదేం చెపుతుంది!

జానకి: ఏమో! ఎన్నివిధాల అడిగినా ససేమిరా చెప్పలా, ఆ శాంతకేమన్నా చెపుతుందో లేదో! మరి. దాని కప్పగించి యిలా వచ్చా!

[‘పోస్ట్’ అని బయటినించి కేక]

భుజంగ: అదిగో, టపా వచ్చింది! [తీసి చదివి నిర్ఘాంతపోతాడు]

జానక: అదేమండి! అలా పలుక్కుండా చూస్తారేం? ఏమి వ్రాశారు? చెప్పరేం?

భుజంగ: (పలకడు)

జానక: అబ్బా! మిమ్మల్నే పలకరేం? నాఖర్మ, జవాబు చెప్పండి.

భుజంగ: కథ అడ్డం తిరిగింది. [విసుగ్గా] చదువుకో!

జానక: [జాబు చదువుతూ]

"బావగారికి,

ఉభయకుశలోపరి:

మా అబ్బాయికి మీ పెద్దఅమ్మాయి నచ్చిందట. మీ కిష్టమైతే ... వివాహం జరిపించటానికి మా అభ్యంతరమేమీ లేదు!

ఇట్లు

వెంకట్రావు"

అయితే శాంతకు పెళ్లి అయినసంగతి వాళ్ళతో చెప్పలేదటండీ?

భుజంగ: ఆ! సందర్భం ఎప్పుడన్నా వస్తేనా! ఇంతకూ...

శాంత: (లోపలినుండి త్వరగా వచ్చి) అమ్మా! సరళ చెప్పిందే! ఆ పెద్దఅబ్బాయి రామారావునే చేసికొంటుందిటే!

భుజంగ: ఏడ్చినట్లుంది! ఆ అబ్బాయికి పెళ్లిఅయి, ఓబిడ్డకూడా!

[అంతా తెల్లబోతారు]



# పాత బంగళా

**ఆశ్లేష**

"ఇకనన్నా నమ్ముతారా?"

"ఇటుపైకూడా నమ్మను"—నిర్మొహమాటమైన సమాధానం విని నిర్విణ్ణుడైనాడు మునసబు గారబ్బాయి అప్పన్నబాబు. ఇంత నిర్మొహమాటంగా జవాబిస్తాడనుకోలేదు. అరుగుమీద కూర్చున్నవారంతా కళ్ళప్పగించి ఇటు అప్పన్నబాబుని, అటు రాజారావుని చూస్తున్నారు. రాజారావుకు ఎలా నచ్చచెప్పాలో ఊహించుకోలేక పోతున్నాడు అప్పన్నబాబు. రెండు వైపులా పదునుగల కత్తిలాటిది తన వాదం — క్రొత్తగావచ్చిన ఈ రెవెన్యూ ఇన్‌స్పెక్టర్, తనకన్నా వయస్సులో చిన్నవాడుగా కనబడే యీ రాజారావు చేత ఓడింపబడటమన్నది తల కొట్టినట్లనిపించింది.

మూలకూర్చుని తాపీగా చుట్ట కాలుస్తున్న మునసబుగారికి, కొడుకు తగ్గటం బాధ కలిగించింది. ఇక తను కల్పించుకోవడం మంచిదని నోట్లో చుట్టను విసరి వేశాడు.

చావడిలోకి కరణం ప్రవేశించాడు. గంభీరంగా మాట్లాడకుండా కూర్చున్న వాళ్ళందరినీ చూడగానే విశేష మేదో వున్నదని తెల్సుకున్నాడు.

"ఏమిటి విశేషం.—అందరూ అలా కూర్చున్నారే?" అన్నట్లుగా కనుబొమ్మలెగరేశాడు నిశ్శబ్దంగా—.

"ఏముంది — పాడునుయ్యి బంగళా గురించి ఏదో మాటొస్తే—'అది దయ్యాల బంగళా' అని చెప్పాం. రాజారావు గారేదో మనం కూడబలుక్కుని చెప్పినట్లుగా అనుకుంటున్నారు", మునసబు బాధ పడుతున్నట్లుగా ధ్వనించాయా మాటలు.

"వీరంతా పట్నవాసం మనుషులు గదూ—అయినా నమ్మని వాళ్ళతో మనకెందుకూ" అన్నాడు హేళనగా కరణం.

ఈ హేళనతో అందరి ముఖాలు వికసించాయి. రాజారావు నవ్విన ఒక్క చిరునవ్వులో కరణంగారి హేళనా గతమైన వాక్కు కాస్తా ఎగిరి పోయింది.

"అయితే కరణంగారూ!—దయ్యాలు మంత్రాలకు లొంగుతాయి...కదండీ!... అటువంటప్పుడు ఆ వచ్చే దారిలో వుండి రాత్రిళ్లు అందర్నీ జడిపించే ఆ బంగళాలో వున్న దయ్యాలపై మీ మంత్రాలు ప్రయోగించ కూడదూ!"—ఉన్న అనుమానమంతా ఇదే అన్నట్లడిగాడు రాజారావు.

"ఆఁ! ఆ ప్రయత్నాలూ జరిగాయి. పురోహితుడు పూర్ణచంద్రయ్యగారు ఏదో హోమం చేసి వాటిని తరిమేస్తానంటే వారి యింటిమీద రెండు సార్లు రాళ్లవర్షం కురిసింది!!..."

"మీ అమ్మాయి......సంగతి చెప్పండి" మధ్యలో అడ్డుకున్నాడు మునసబు.

"ఆ...ప్రక్కవూరు పంచాయితీలోనేగా చేరింది ఈ వూరు. దానికి అర్జీ పెట్టుకున్న సాయంత్రం.........నేను ఇంట్లో కాలు పెట్టానో లేదో...—మా అమ్మాయి వెట్టికేక వేసి చతికిల పడింది—ఏమిటిరా అనుకుంటే—ఏదేదో వాగటం మొదలెట్టింది. మా అమ్మాయికి రాని ఇంగ్లీషులో—మాట్లాడితే 'నో—నో'—అంటూ కేకలు—సరి...ఆ దయ్యం పట్టిందని—ఏంకావాలో అడిగితే—ఆ యింటిపై అసలు చేయి వేయవద్దూ—వేశారంటే ఈ గ్రామాన్నే నాశనం చేస్తాను జాగ్రత్త! అంటూ మొదలెట్టింది. అయినా యివన్నీ చెబితే మీకు వింత, — అపనమ్మకమూ — రాజారావుగారూ"—అంటూ అప్పన్నబాబు వైపు తిరిగి సగర్వంగా నవ్వాడు కరణం.

దూరంగా పోతున్న రజాక్‌ను కేక వేసి పిలిచాడు మునసబుగారబ్బాయి.

"ఏంరా సాయిబూ!—నువ్వు రాత్రిళ్ళు వూళ్లోంచి బండి తోలుకొస్తుంటావుకదా!... ఆ పాతనుయ్యి బంగాళాపక్కనుంచేగా వచ్చేదీ—అక్కడ ఎప్పుడైనా ఏదైనా చూశావా?"—ప్రశ్నలన్నీ రాజారావువైపు ముఖంపెట్టి అడిగాడు అప్పన్నబాబు.

"ఓ—దొర బెంగోళా—హాసాబ్, ఒక్క రాత్రి తీన్ బజేకు వస్తుంటే నా ఘోడా హోగీ పోయిందీ—అరె హంతలో రెండు మూడు పత్తర్ పడ్డాది సాబ్!"—భయపడ్డాడు సాయిబు.

రాజారావు ఆ రాత్రిని తలుచుకొని సాయిబు పడిన భయాన్ని చూసి ఆశ్చర్యపోయాడు.

"ఆఁ!...అయినా— ఉత్తినే అదేం చెయ్యదు-మా అమ్మాయి ప్రొద్దుటే తెల్లారిగట్ల లేచి పొంతలోకి వెళ్ళి-బావిదగ్గర స్నానం చేసి నీళ్ళు తెచ్చుకుంటుందిగా మా అమ్మాయి నేమీ అనదే" అన్నాడు కరణంగారు.

"మీ అమ్మాయి వంటరిగా వెళ్తుందా!" ఆశ్చర్యమైంది రాజారావుకు కరణంగారి కుమార్తె ధైర్యానికి.

"అబ్బే...వెనుక మా పనిజేసేది వుంటుందండీ?"

"నుయ్యి మీ యింటి కెంతదూరమో?"

"ఆ బంగాళా దాటి కొద్దిగా వెళ్ళాలి."

"అయితే ఆ బంగళాగుమ్మం మీ ఇంటికీ... నుయ్యికీ మధ్య వుంటుందన్నమాట."

"ఆఁ......అంతేగా మరీ......"

ఆలోచనలో పడ్డాడు రాజారావు. అది దయ్యాల కొంప. ఎవరో చచ్చారా కొంపలో—దానిని ఆ స్థితిలోనే వుంచాలని ఆ దయ్యం కోరికట—తను ఒక్కసారీ దయ్యాన్ని చూడలేదు. ఎలా నమ్మటం?

చీకటి పడింది. ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. అప్పన్నబాబు, మునసబు, కరణం—రాజారావుదగ్గర సెలవుతీసుకొని వెళ్ళిపోయారు.

—"ఎలా నమ్మాలీ...కష్టంగా తోచింది రాజారావుకు. ఆరాత్రి తన వంటవాడు సుబ్బయ్యను అనేకవిధాల ప్రశ్నించాడు. వాడిదీ ఈవూరే కనుక. 'అంతా నిజం' అన్నాడు—

—పోనీ తనే రాత్రివెళ్ళి చూస్తే...... 'అమ్మో' అనుకున్నాడు. ఎన్నడూ లేని భయం అతన్ని ఆవేశించింది.

'ఇదికాదు'—వెంటనే లేచి 'సారంగధర్'కు వుత్తరం వ్రాశాడు.

* * *

ఉత్తరం వ్రాసిన రెండురోజులకల్లా సారంగధర్ వచ్చాడు తన సర్వసామగ్రితో-రాజారావుకు వింతగా తోచింది—అతని రెండు పెట్టెల్నీ అతడినీ చూడగానే.

"ఎన్నిరోజులు మకాం వేద్దామని వచ్చావురా నాయనా?"

"ఉత్తరంలో వ్రాసినదాన్ని సమగ్రంగా విచారించి తేల్చుకొని వెళ్ళిపోవాలి—ఎంత త్వరగా అయితే అంత నాకేమంచిది. అసలు చచ్చేటంత పని పెట్టుకొని వచ్చాను" గంభీ

## అతి సౌందర్య తిలకంగా నుండుటకు

ఆకర్షణీయమైన సౌందర్య వికాసముతో మనోహరముగా
పొద్దు పుచ్చుడు. సంవత్సరాంతమున్ను సంతృప్తిగాను,
చల్లగాను, పరిశుభ్రంగాను ఉండుటకు. చర్మమును
పోషించునట్టిది, పౌడరు ఆధారమునకు దివ్యమైనట్టిది
యగు - 'హేజ్‌లైన్' స్నో" ను ఉపయోగించుడు.
ఇది చోర-విరోధక సీలుతో ప్యాక్ చేయబడి వచ్చుచున్నది.




**"'HAZELINE' SNOW"**

(TRADE MARK)

"'హేజ్‌లైన్' స్నో" (ట్రేడ్ మార్కు)



బరోస్ వెల్కమ్ ప్రాడక్ట్



# పాత బంగళా



తంగా ముఖంపెట్టాడు సారంగధర్.

"ఏం! కొంపతీసి సెప్టెంబరుకు మళ్ళీ కూర్చుంటున్నావా?" అంటూ తన నవ్వును రెట్టించాడు రాజారావు.

"ఇక ఆ బి. ఏ. కూ, నీకూ ఒక్క నమస్కారం — ఈమధ్య మా పెద్దవదిన రైల్లో వస్తుంటే ఒక పెండ్లివారు అదే కంపార్టుమెంటులో కూర్చుని మధ్యలో దిగిపోతూ పొరబాటునో అలవాటునో మావదిన ట్రంకును కూడ దింపుకున్నారు—రైలుదిగిపోతూ తన పెట్టెజాడ కనబడక ఇంటికొచ్చి ఫిర్యాదు చేసింది—వెంటనే మానాన్నగారు పోలీస్ ఇన్‌స్పెక్టర్ కావడంచేత దర్యాప్తు ప్రారంభించారు. దాంట్లో ఆ కేసును కడకు తేల్చింది యీ షెర్లాక్" — సగర్వంగా గుండె గుద్దుకున్నాడు సారంగధర్.

ఈమధ్య తనుకొన్న పరికరాలన్నిటినీ ఒక్కొక్కటీ రాజారావుకు చూపి వాటిని గూర్చి వివరించాడు. రాజారావుకు అతడిని చూచినకొలదీ వింతగా తోచింది—ఏదో ఇటువంటి విషయాలంటే సరదాకదా— అని ఉత్తరం వ్రాస్తే—! హత్యకేసును విచారించటానికి వచ్చిన డిటెక్టివ్ లాగ వచ్చాడు సారంగధర్.

"అయితే — ఉత్తరంలో సవిస్తరంగా వ్రాయలేదు—అసలు సంగతేమిటోయ్?"—సిగరెట్ పొగ ముక్కులోంచి దూసుకు వచ్చింది.

"నువ్వు—ఈవూరు జట్కాలో వచ్చావు కదా!—వచ్చేటప్పుడు చూసిన విశేషాలేమన్నా వున్నాయా?" ఎదురు ప్రశ్న వేశాడు రాజారావు.

"వెరీగుడ్. అలా అడుగు—వస్తూంటే ఊరిచివర ఒక బావిగలదు. అచ్చట కొందరు వడతులు నీరుతోడుకొనుచున్నారు.. ఏం?"

"వన్."

"తరువాత కొద్ది ఖాళీప్రదేశం—తర్వాత ఒక మంచి రాతికట్టడం..."

"గుడ్ - టూ."

"తర్వాత కొంత దూరం వరకు ఖాళీ ప్రదేశం - తర్వాత ఇండ్లు ప్రారంభం."

"దట్స్ గుడ్."

"ఎడమ కుడిచేతులవైపు త్రిప్పి యీ కొంపకు తీసుకువచ్చాడు బండివాడు."

"పరిశీలన బాగున్నది."

"మరి నన్ను ఉత్తినే షెర్లాక్ అనమన్నానా?" అంటూ నవ్వేశాడు సారంగధర్.

"ఏం లేదురా—ఈవూరికి ప్రత్యేక పంచాయతీ ఏర్పాటు చేయవచ్చునని సూచనచేస్తే — బాగుందిగాని ఆఫీసులకు స్థలం కావాలన్నారు కొందరు. అందుకు ఆ పడిపోయిన బంగళా బాగుచేయించమన్నాను. దానికి...ఇంత...చెప్పారు.

అసలు ముప్ఫై అయిదేళ్ళక్రితం ఇక్కడికొక దొరసానివచ్చి...ఆ బంగళాకట్టించి, నుయ్యి త్రవ్వించినతరువాత హఠాత్తుగా గుండెఆగి చచ్చిపోయిందట. ఆ దొరసాని దయ్యమై అప్పటినుండి వదలకుండా ఆ ఇంట్లోనే ఉందట. దాని పరిసరప్రాంతాలపై ఎటువంటి జోక్యం కలిగించుకున్నా అది ఊరుకోదు......కథ పూర్తిచేశాడు రాజారావు.

సాయంత్రందాకా నిద్రపోయాడు సారంగధర్—ఆఫీసు కాగితాల్ని చూసుకుంటూ కూర్చున్నాడు రాజారావు. సారంగధర్ నిద్రలేచి స్వంతంగా కాఫీ పెట్టుకొని త్రాగి సుబ్బయ్యను తీసుకొని షికారుకు బయలుదేరాడు.

చీకటి పడుతుందనగా తిరిగి వచ్చాడు. ఇంతలో రాజారావు అందరితో ఇష్టాగోష్ఠి పూర్తిచేసి ఇళ్ళకు పంపుతున్నాడు. తన స్నేహితుడు చూడటానికి వచ్చాడని చెప్పాడు వాళ్ళందరికీ. అందరూ ఇళ్ళకు వెళ్ళారు.

భోజనంచేసి ఏ బెడదా లేనివానిలా నిద్రపోయాడు సారంగధర్. సరిగ్గా పదకొండు గంటలకు లేచి రాజారావును లేపాడు. అతడి వేషాన్నిచూచి విస్తుపోయాడు రాజారావు—నల్లటి పేంట్ పైన నల్లటి పొడుగాటికోటు, అదేరంగు హేట్—చీకటిలో అతడిని గుర్తించడం కష్టం.

"లేరా!—నీవు నల్లటి ట్వీడ్ పేంట్ వుండాలిగా వేసుకొని, బ్లూ కోటు వేసుకో—" చెయ్యిపట్టిలాగి కూర్చోపెట్టాడు రాజారావుని.

ఖర్మ అనుకుంటూ లేచి బయలుదేరాడు. సారంగధర్ ఊరి వెనుకవైపునుండి పొలాలవైపు నడచి వూరవతలకి నడిపించాడు.

మెల్లగా బంగళా దొడ్డిలోకి ప్రవేశించారు-చెట్లు చాటుగావెళ్ళి నూయి వెనకాల కూర్చున్నారు. రాజారావుకు నిద్ర కూరుకు వస్తోంది. అలానే నూతికి జారబడి కూర్చున్నాడు.

తెల్లారింది—మెల్లగాలేచి ఇద్దరు వచ్చిందారినే ఇల్లు చేరుకున్నారు.

మరునాడు మళ్ళీ సాయంత్రం సారంగధర్ ఆ ప్రాంతాలలోకి వెళ్ళివచ్చాడు. రాత్రి పదకొండుకు యథాప్రకారంతయారై రాజారావును బలవంతంగా డ్రస్ చేయించి తనతో లాక్కెళ్ళాడు.

నిన్నటిదారినే నడచి బంగళా చేరుకున్నారు. సీతాఫలాల చెట్లు వైపున నూతికి జారబడి కూర్చున్నారిద్దరూ. రాజారావు ఒక్క కునుకు తీశాడు.

నిద్రలేచేసరికి అప్పటిదాకావున్న గుడ్డివెన్నెల కాస్తా పోయింది. సారంగధర్ నిలబడి దేనివైపో తీక్షణంగా చూస్తున్నాడు.

"ఏమిటిరా?" నిద్రమత్తులో ప్రశ్నించాడు రాజారావు.

"ఏం లేదు—పాముకటి అలా పోతోంది."

"అమ్మో!"—నిజంగా కరిచినట్లు త్రుళ్ళిపడి కళ్ళు నులుపుకున్నాడు రాజారావు.

"ఫర్వాలేదు—నువ్వు నోర్మూయ్"

"టైం—ఎంతా?" గొణిగాడు.

"మూడూపది" రేడియం డయల్ వాచీ చూపాడు సారంగధర్.

"పోదాంరా!" తనపాట మొదలెట్టాడు రాజారావు.

"ష్..."—సారంగధర్ ఒక్కసారిగా రాజారావుని క్రిందకు నొక్కివేసి తనూ అతడితో కూర్చుని దేనివైపో తొంగి చూస్తున్నాడు. రాజారావు అతడి తలప్రక్కనే

(56-వ పేజీ చూడండి)

## అంతరిక్షయాత్ర

# రష్యన్ కృత్రిమ చం

ప్రపంచప్రజలందరినీ సంభ్రమాశ్చర్యాలలో ముంచివేసిన అద్భుతవార్త ఒకటి ఈనెల 4 వ తేదీ మాస్కో రేడియోనుంచి వెలువడింది.

ఆకాశంలో 560 మైళ్ళ ఎత్తున—గంటకు 18000 మైళ్ల వేగంతో 188 పౌనుల బరువు, 23 అంగుళాల వ్యాసము కలిగిన ఒక కృత్రిమ 'ఉపగ్రహం' (శాటిలైట్) 95 నిమిషాలకొకసారి రోజుకు 16 సార్ల చొప్పున భూమిచుట్టూ తిరుగుతోందని ఆ వార్త సారాంశం.



అమెరికన్ శాస్త్రజ్ఞులు అంతరిక్షంలోకి పంపించబోయే గోళం నమూనా. ఇది రష్యన్ల గోళంకంటె బాగా చిన్నదైనా ఇదీ రోజుకి 16 సార్లు భూమిచుట్టూ తిరిగివస్తుంది.

మొట్టమొదటిసారిగా ఇటువంటిగోళాన్ని ఆకాశంలోకి పంపించిన ఘనగౌరవం సోవియెట్ రష్యాకు దక్కింది. ఆర్థికంగాను, సాంస్కృతికంగాను తమకంటె వెనుకబడిన దేశమని పాశ్చాత్యరాజ్యాలు నమ్ముతూ, నమ్మిస్తూవచ్చిన సోవియెట్ రష్యా ఇంతవరకూ ఏ దేశమూ సాధించని మహత్తర విజయాన్ని సాధించడమే ఆశ్చర్యానికి కారణమైంది.

రష్యా పంపించిన కృత్రిమ చంద్రగోళం ప్రపంచానికి హాని చేసేది కాదు; మీదు మిక్కిలి మానవకళ్యాణానికి, ఉత్తరోత్తరా మానవుడు సాధించబోయే అద్భుతవిజయాలకు సోపానంచేసేది. అందుచేత ఇది అన్ని దేశాల వారూ గౌరవించి, హర్షించవలసిన సంఘటన.

## గోళాందోళన

ఈభయాందోళనలకు గడిచిన ఆగస్టు 26వ తేదీనే అంకురార్పణ జరిగింది. అంతవరకూ అణ్వస్త్రాలలో తమదే పైచేయి అని పశ్చిమ రాజ్యాలు భావిస్తూవచ్చాయి. కాని ఆనాటితో ఇది కేవలం ఆత్మవంచనఅని తేలిపోయింది. ఆనాడు రష్యా ఖండాంతర వేధి అయిన ఒక అస్త్రాన్ని పరీక్షార్థం ప్రయోగం చేసింది. ఇది 5,500 మైళ్లు కొద్దినిమిషాలలో ప్రయాణం చేసి అనుకున్న స్థలంలో పడి ధ్వంసంచేసే శక్తిగల అస్త్రం. ఈఅస్త్రాన్ని ఒకరికంటె ఒకరు ముందుగా తయారుచెయ్యాలని రష్యా, అమెరికాలు పోటీపడ్డాయి. చివరకు రష్యాయే దీన్ని ముందుగా సాధించింది. అయితే ఆవార్త మొదటగా ప్రకటించబడినప్పుడు అది కేవలం బుకాయింపుఅని పశ్చిమరాజ్యాలలో కొందరు భావించారు. కాని ఈనెల ప్రారంభంలో రష్యా కృత్రిమ చంద్రగోళాన్ని ఆకాశంలోకి వదలడంతో వారికి కనువిప్పుఅయింది. ఖండాంతరవేధి (ఇంటర్ కాంటినెంటల్ బాలిస్టిక్ మిసిలీ)కూడా రష్యన్ల వద్ద ఉంటే ఉంటుందని దీనివల్ల వెల్లడిఅయింది. రష్యాను ఇదివరకటిలాగా నిర్లక్ష్యంగా త్రోసి రాజనడానికి వీలులేదని పాశ్చాత్య రాజకీయ నాయకులు ఈనాడు గ్రహించారు.

ఖండాంతరవేధికి, కృత్రిమ చంద్రగోళానికి దగ్గర చుట్టరికం ఉన్నది. రెండూ ఒకే సిద్ధాంతంమీద ఆధారపడి పనిచేసే సాధనాలే. రెండూ రాకెట్ ఇంజన్ల సహాయంతో ప్రయాణంచేసే సాధనాలే. అయితే రెంటికీ ప్రధానమైన వైరుధ్యంకూడా ఉన్నది. ఒకటి ప్రపంచాన్ని ధ్వంసం చేసేది. మరొకటి ప్రపంచ కళ్యాణాన్ని సాధించేది. ఒకదానిలో బ్రహ్మాండమైన మారణాస్త్రం ఉంటుంది. మరొకదానిలో ఇంతవరకూ అజ్ఞాతంగా ఉండిపోయినఅనేక అమూల్య వైజ్ఞానిక రహస్యాలనుకనుక్కొనే పరికరాలుంటాయి. అవే రాకెట్లను శాంతి ప్రయోజనాలకు గాని, యుద్ధ ప్రయోజనాలకుగాని ఉపయోగించుకోవచ్చును. ఈ రెండు సాధనాలను తమకంటె రష్యాయే ముందుగా తయారుచేయడం పాశ్చాత్య

కృత్రిమ చంద్రగోళం ఎక్కడ, ఎప్పుడు, ఎన్నిసార్ల
మార్గంమీద ఆధారపడి ఉం



## లో కొత్త మెట్టు

# ంద్రగోళ పరిభ్రమణం

తో పాటు మరి రెండు యంత్ర భాగాలు కూడా ప్రదక్షిణం చేస్తున్నాయి. గోళాన్ని దాని కక్ష్యలో వదిలిన ఆఖరి రాకెట్ ఒకటి. ఇది గోళానికి 700 మైళ్ళ దూరంలో ఉంది దాదాపు అదే వేగంతో పరిభ్రమిస్తూ ఉంది. మరొకటి గోళం రాకెట్ తో పాటు ఎగిరినప్పుడు దాన్ని కాపాడుతూ ఉండిన కోణాకారపు సాకెట్. ఆ రాకెట్, ఈ సాకెట్ రెండూ ఇంకా తిరుగుతూనే ఉన్నాయి.

రాజ్యాలలో భయాందోళనలకు, పరాభవ భావానికీ కారణమైవుంటుంది.

గడచిన జూలై 1 వ తేదీన ప్రారంభమైన "అంతర్జాతీయ భూభౌతిక సంవత్సరం"లో ఇటువంటి గోళాలను ఆకాశంలోకి పంపించాలని అమెరికా, రష్యాలు పథకం వేసుకున్నాయి. 1955 జూలైలోనే ముందు అమెరికా, తరవాత రష్యా తమతమ పథకాలను వెల్లడించాయి. అమెరికా మొన్న సెప్టెంబరులో గోళప్రయోగం చేయాలని నిర్ణయించుకుని, తరవాత, వచ్చే సంవత్సరానికి వాయిదా వేసుకుంది. కాని రష్యా "త్వరలోనే" తాము గోళప్రయోగం చేయనున్నామని సెప్టెంబరు 17 న ప్రకటించింది. మరి కొద్దిరోజులలో నిజంగానే ప్రయోగం చేసింది. త్వరలో ఇంకా ఇటువంటి గోళాలను చాలా ప్రయోగిస్తామని, అవి ఈ మొదటిదానికంటే పెద్దవిగాను, బరువుగాను, ఇంకా శక్తివంతమైన పరికరాలతోను ఉంటాయని రష్యన్లు ప్రకటించారు. ఈ గోళాలప్రయోగం మొదటిమెట్టు మాత్రమేననీ, కొద్ది సంవత్సరాలలో చంద్రుడిలోకి, ఇంకా దూరానవున్న అంగారక, శుక్ర గ్రహాలలోకి కూడా ప్రయాణాలుచెయ్యడం సాధ్యమనీ, మనుషులుకూడా అంతరిక్ష ప్రయాణం చేసేరోజు, చంద్రగోళంమీదికి దిగేరోజు దగ్గర్లోనే ఉందని రష్యన్ శాస్త్రజ్ఞులు ప్రకటిస్తున్నారు.

కనిపిస్తుందనేది ఆ గోళంతిరిగే

టుంది.



భూమిచుట్టూ తిరుగుతూ ఆకాశంలో పరిశోధనకేంద్రాన్ని నిర్మించుకోవడం ఈ ఊహాచిత్రంలో చూడవచ్చు.
(బ్రిటిష్ శాస్త్రజ్ఞుడు ఎమ్. డబ్ల్యు. హోలీ వేసిన చిత్రం.)



## రాకెట్, సాకెట్

ఏది ఏమైనా రష్యా నిర్మించిన కృత్రిమ చంద్రగోళం మాత్రం ఇంకా భూమిచుట్టూ ప్రదక్షిణాలు చేస్తోంది. దాని ఈ గోళంలో అతి సున్నితమైన శాస్త్ర పరికరాలు అమర్చారు. వీటిలో రెండు రేడియో ప్రసారక యంత్రాలు అతి శక్తివంతమైనవి ఉన్నాయి. వీటినుంచి "బీప్-బీప్" అని ఏవో సంకేతాలు వస్తున్నాయి. ఈ సంకేతాలను అన్ని దేశాల



రాకెట్‌కు కావలసిన ఇంధనాలను ఆకాశంలోనే 'రాబట్' ద్వారా సమకూర్చుకునేపద్ధతిని ఈ ఊహాచిత్రంలో చూడవచ్చు. కుడివైపున బొమ్మలో 'రాబట్'ను చూడవచ్చు. (రాల్ఫ్‌స్మిత్ అనే ఆయన వేసిన చిత్రం.)

# అంతరిక్షయాత్రలో కొత్తమెట్టు

లోనూ శాస్త్రజ్ఞులందరూ రేడియో గ్రాహక యంత్రాలద్వారా వింటున్నారుగాని, ఇదమిత్థమని వాటిని నిర్వచించలేకపోతున్నారు. రష్యన్ శాస్త్రజ్ఞులుమాత్రం వాటినుంచి అనేక విషయాలు అప్పుడే తెలుసుకున్నారనీ, ఈ తెలుసుకున్న విషయాలను "భూభౌతిక సంవత్సరపు" ఒడంబడిక ప్రకారం ప్రపంచ శాస్త్రజ్ఞులందరికీ అందచేస్తామనీ రష్యా ప్రకటించింది.

ఈ గోళంలో శాస్త్ర పరికరాలను అమర్చిన ప్రొ॥ ఫెసెంకోవ్ అనే ఆయన ఆ పరికరాలు భూమినీ, ఇతర గ్రహాలను ఫోటోలు తీస్తున్నాయనీ, ఈ ఫోటోలను 400 రెట్లు పెద్దవిచేసి పరిశీలించి భూమి స్వరూపం మొదలైన విషయాలను కనుక్కోవచ్చునని వెల్లడించాడు. గోళం కొన్ని నెలలపాటు అంతరిక్షంలోనే ఉండగలదని ఆయన అన్నాడు.

వాషింగ్టన్‌లో "భూభౌతిక సంవత్సర" సమావేశానికి హాజరైన రష్యన్ రాకెట్ శాస్త్రజ్ఞుడు ప్రొ॥ ఎ. ఎ. బ్లాగన్‌రవావ్ అనే ఆయన గోళంలో రెండు రేడియో ప్రసారక యంత్రాలు మినహా ఏమీ లేవని చెప్పారు. ఈ గోళంనుంచి అన్ని విషయాలూ తెలుసుకోలేమనీ, కేవలం రాకెట్లతో గోళాన్ని ఎగరవేసి, భూమిచుట్టూ తిప్పే విధానాన్ని పరీక్షించి స్థాపించడానికి ఈ ప్రయోగం చేశామనీ చెప్పారు. కాని డా॥ యూరీ డిమిట్రివిచ్ బోలంజర్ అనే మరొక రష్యన్ శాస్త్రజ్ఞుడు మాస్కో రేడియోలో మాట్లాడుతూ, విశ్వాంతరాళంలోంచి వచ్చే సూక్ష్మపదార్థాలు కృత్రిమ గోళాన్ని తాకుతాయనీ, ఆ తాకిడిని తెలియజేసే పరికరాలు కూడా అందులో అమర్చామనీ తెలియజేశాడు. ఈ సమాచారం ముందుముందు ఆకాశ ప్రయాణాలకు పనికి వస్తుందని ఆయన అన్నాడు. కొన్నిరోజులనుంచి కొన్ని వారాల వరకూ ఆగోళం అంతరిక్షంలో తిరుగుతూ ఉండవచ్చునని ఆయన అభిప్రాయం. అందులో కొన్ని రసాయనికమైన బ్యాటరీలు అమర్చామనీ, ఆ బ్యాటరీలు ఖర్చయిపోయేదాకా అది అక్కడే కొన్నివారాలపాటు తిరుగుతూఉంటుందని ప్రొ॥ స్పెర్చాకోవ్ అనే శాస్త్రజ్ఞుడు "రెడ్ స్టార్" (రష్యన్ సైనిక పత్రిక)లో వ్రాశాడు. భూమిమీద వేరువేరు ఎత్తుల్లో గాలి ఒత్తిడి, అయనైజేషన్ ఒత్తిడి సూర్యనక్షత్ర కాంతుల వర్ణస్వభావం విశ్వకిరణాలు, సూర్యగోళంలో కలిగే కల్లోలాలు, అయస్కాంత కల్లోలాలు, భూమిస్వరూపం, ధ్రువకాంతులు మొదలైన అనేకవిషయాలను ముందు ముందు వదలబోయే కృత్రిమ చంద్రగోళాలద్వారా కనుక్కోవాలని ఆశిస్తున్నట్లు రష్యన్ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఆగోళాల్లోని బ్యాటరీలు ఎప్పటికప్పుడు సూర్యుడినుంచి శక్తిని సంపాదించి ఎంతకాలమైనా అంతరిక్షంలో తిరుగుతూ ఉండగలవని వారు అంటున్నారు.

## గోళంతో పిచ్చాపాటి

కృత్రిమ చంద్రగోళాన్ని రష్యన్ శాస్త్రజ్ఞులు ఏవో ప్రశ్నలు అడుగుతున్నారని, వాటికి అది సమాధానాలిస్తోందని ఆస్ట్రేలియాలో జాక్ డౌలింగ్ అనే శాస్త్రజ్ఞుడు ప్రకటించాడు. ఆ సమాధానాలను తాను ఫోటోతీశానని అతడు చెప్పాడు. అంతకుముందే కాలిఫోర్నియా టెక్నాలజీ విద్యాలయం తాలూకు డా॥ విలియం పికరింగ్ అనే శాస్త్రజ్ఞుడు ఈ విషయం కనుక్కున్నాడు. గోళం పంపించే సంకేతాలలో మార్పులు కనిపించాయనీ, ఈ మార్పులను బట్టే రష్యన్లు దానితో ఏదో సంభాషణలు జరుపుతున్నారని తాను భావించాననీ అతడు చెప్పాడు.

బ్రిటిష్ అంతర్గ్రహయానసంఘ ఉపాధ్యక్షుడు ఎన్. కెన్నెత్ గాట్‌లాండ్ రష్యన్ గోళాన్నిగూర్చి వ్యాఖ్యానిస్తూ అది ఆకాశ ప్రయాణాలను సాధ్యంచేసేందుకు చాలా ఉపయోగపడుతుందని ప్రకటించాడు.

అంతర్జాతీయ "భూభౌతిక సంవత్సరం" తాలూకు అమెరికన్ సంఘాధ్యక్షుడు డా॥ కాప్లాన్ ఒక ప్రకటన చేస్తూ ఇంత పెద్ద గోళాన్ని ఆకాశంలోకి పంపించడం చాలా ఆశ్చర్యకరమని, ఇంత తక్కువవ్యవధిలో ఈ విజయాన్ని సాధించడం మరీ ఆశ్చర్యమనీ అన్నాడు.

## అమెరికా "గంద్రగోళం"

రష్యన్లు కృత్రిమ చంద్రగోళాన్ని ఆకాశంలోకి "రాకెట్" చేశారనేవార్తవినగానే, అమెరికనులు మొదట ఉలిక్కిపడినా, వెంటనే తేరుకుని త్వరలో తాముకూడా గోళాలను పంపించడానికి సన్నాహాలు చురుకుగా చేస్తున్నారు. అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ విజయంసాధించిన సోవియెట్ శాస్త్రజ్ఞులను అభినందించారు. తాముకూడా వచ్చే డిసెంబరులో కృత్రిమ "ఉపగ్రహ" పరీక్షలు ప్రారంభిస్తామనీ ఆయన చెప్పారు. గోళాన్ని పైకిపంపించడానికి మూడుఅంచెల రాకెట్‌ను ప్రయోగిస్తామని, ఇటువంటి 7 రాకెట్లను పరీక్షార్థం ప్రయోగిస్తామని అమెరికన్లు వెల్లడించారు. మరొక 6 రాకెట్లను శాస్త్ర పరికరాలతో కూడిన గోళాలను పంపించడానికి ఉపయోగిస్తారట. ఇలా పరికరాలతో కూడిన గోళాల ప్రయోగం వచ్చే మార్చి ఏడుదాకా ప్రారంభించరు. అదిగాక

ఈగోళాలు రష్యన్ గోళాలకంటె బాగా చిన్నవి. వీటిబరువు 20 పౌనుల 8 ఔన్సులు మాత్రమే ఉంటుంది. ఒకపౌను బరువుని సరియైన ఎత్తుకు సరియైనవేగంతో పంపించి వదలాలంటే వెయ్యిపౌనుల రాకెట్ శక్తి ఉపయోగించాలనీ, ఈలెక్క ప్రకారం 183 పౌనుల గోళాన్ని పంపించడానికి రష్యన్లు 1,83,000 పౌనుల రాకెట్ శక్తిని ఉపయోగించి ఉండాలనీ అమెరికన్ ఇంజనీర్లు చెబుతున్నారు. ఇంతశక్తిగల రాకెట్లు తమ వద్దలేవని వారంటున్నారు.

ఈ కారణంచేతనే కావచ్చును-రష్యన్ శాస్త్రజ్ఞులు అమెరికన్ శాస్త్ర పరికరాలను తమ గోళాలలో అమర్చి పైకి పంపించిపెడతామని అంటున్నారు. అమెరికన్లు ఒకకొత్త రకం స్పెక్ట్రొమీటర్ కనిపెట్టారట. ఇది వాతావరణంలో పైకి పోయినకొద్దీ ఉండే పరమాణువులను, వాటి బరువులను పరిశీలించడానికి ఉపయోగిస్తుంది. ఈ స్పెక్ట్రొమీటర్ చాలా తేలికగా, సూక్ష్మంగా ఉండేట్లు అమెరికన్లు తయారు చేశారు. అయితే ఇది అమర్చడానికి తమ కృత్రిమ "చంద్రగోళాల"లో ఎక్కడా జాగాలేదట. ఈ సంగతి విన్నవెంటనే వాషింగ్టన్‌లో ఉన్న రష్యన్ శాస్త్రజ్ఞుడు ప్రొ॥ బ్లాన్‌గ రవావ్ ఆ సూక్ష్మయంత్రాన్ని కావలిస్తే తామెగరవేసే గోళంలో అమర్చి పంపిస్తామని అన్నాడు. అంతేకాక చూడదలుచుకుంటే అమెరికన్ శాస్త్రజ్ఞులు రష్యా వచ్చి గోళప్రయోగ విధానాన్ని పరిశీలించుకోవచ్చుననీ కూడా ఆయన చెప్పాడు.

రష్యన్లు గోళప్రయోగం చేయడానికి నిజంగా కారణభూతులైనది జర్మన్ శాస్త్రజ్ఞులని పశ్చిమరాజ్యాలలో కొందరు భావిస్తున్నారు. గత ప్రపంచయుద్ధం తరవాత జర్మన్ రాకెట్ శాస్త్రజ్ఞులు కొందర్ని రష్యను బంధించి తీసుకుపోయారనీ, వారే ఈ మహత్తరసంఘటనకు తోడ్పడ్డారనీ వీరి భావం. అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ కూడా దాదాపు ఇదే అభిప్రాయం వెల్లడించారు. కాని తమకు జరిగిన గర్వభంగాన్ని కప్పిపుచ్చుకోడానికే పశ్చిమరాజ్యాల వారిలా భావిస్తున్నారని పాశ్చాత్య శాస్త్రజ్ఞుడే ఒకాయన ప్రకటించాడు.

రష్యన్ శాస్త్రజ్ఞులుమాత్రం ఇది కేవలం తమ స్వీయకృషివల్ల సాధించిన విజయమేనని చెబుతున్నారు. చాలా ఏళ్లుగా తాము రాకెట్ శాస్త్రంలో పరిశోధనలు చేశామని వారంటున్నారు. అసలు విశ్వాంతరాళంలోకి మానవుడు ప్రయాణం చేయవచ్చునని సహేతుకంగా ఊహించిన మొదటి శాస్త్రజ్ఞుడు కానస్టాంటిన్ జియోల్‌కోవ్‌స్కీ అనే రష్యన్ అట. ఆయన నూరవ జన్మదినోత్సవం గడచిన నెల 18 వ తేదీన రష్యాలో బ్రహ్మాండంగా జరిపారు కూడాను. అదీగాక రష్యా ప్రభుత్వమూ, పత్రికలూ తమకమ్యూనిస్టు విధానంలోనే తమ విజయానికి మూలకీలకం ఉందనీ, శాస్త్రాభివృద్ధికి కమ్యూనిజం దోహదం చేసినంతగా మరే విధానమూ దోహదం చేయదనీ, చెబుతున్నాయి.

## చంద్రలోక ప్రయాణం

ఇది ఇలాఉండగా సోవియెట్ శాస్త్రజ్ఞులు చంద్రమండల ప్రయాణాలకు, అంగారక, శుక్రగ్రహ ప్రయాణాలకు కూడా పరిశోధనలు జరుపుతున్నారు.

దూరంగా ఆకాశంలో మబ్బులతో దోబూచులాడే చంద్రుడు, పాలసముద్రంలోంచి లక్ష్మికి తోబుట్టువుగా జన్మించిన చంద్రుడు, దేవతలకు అమృతం ఆహారంగా ఇచ్చే చంద్రుడు, మానవుల జీవితాలను తీర్చిదిద్దే "గ్రహాల్లో ఒకడైన" చంద్రుడు—నిజంగా చంద్రుడుకాడా? గాలీ, నీరూ, జీవమూలేని చల్లని గోళంమాత్రమేనా? ఆ గోళాన్ని నిజంగా మానవుడు ఎన్నటికైనా చేరుకోగలడా? అనేక సంవత్సరాలుగా శాస్త్రజ్ఞులను వేధిస్తున్న యీ ప్రశ్నలకు సమాధానం త్వరలోనే వస్తుందనీ, అయిదు లేక పదిసంవత్సరాలలోనే చంద్రలోక ప్రయాణం సాధ్యమనీ సోవియెట్ శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. ప్రొ॥ యు. క్లెబ్‌జెవిచ్ అనే ఆయన ఒక వ్యాసంలో తన సిద్ధాంతాలను ఇటీవల వెల్లడించాడు.

చంద్రలోక ప్రయాణానికి ముందు నాలుగు ఘట్టాలను అధిగమించాలని ఆయన వ్రాశాడు.

మొదటి దశలో: బాగా బరువైన కృత్రిమచంద్రగోళాలను తయారుచేసి వాతావరణంలోకి, అయొనోస్ఫియర్ లోకి, ఇంకాపైన ఆకాశంలోకి పంపించాలి. అక్కడ వేడి, ఒత్తిడి మొదలైనవన్నీ ఎలా ఉన్నది ముందు తెలుసుకోవాలి. ఆ గోళాల్లో కోతుల్లాంటి జంతువులను కూడా ఉంచి, వాటి ప్రవర్తనను టెలివిజన్ ద్వారా పరిశీలించాలి. ఈ గోళాలు భూమిచుట్టూ మాత్రమే తిరిగేవి.

రెండో దశలో: కొన్ని రాకెట్లను చంద్రుడివద్దకు "షూట్" చెయ్యాలి. మనకెప్పుడూ కనిపించకుండా చంద్రుడికి అవతల ప్రక్కన ఉండే భాగంమీద సూర్యకాంతి దిట్టంగా పడుతున్న సమయంలో ఈ రాకెట్లను పంపించాలి. అవి చంద్రుడికి యింకా కొన్ని వేలమైళ్ళ దూరంలో ఉండగానే ఫోటోలుతీసి భూమిమీద మన టెలివిజన్ తెరలమీదికి ప్రసారంచేస్తూ ఉంటాయి. చంద్రమండలంలో పడిపోయేదాకా ఆ రాకెట్లు ఫోటోలు తీసి పంపిస్తూనే ఉంటాయి. ఆ రాకెట్ల వేగంలో తగ్గుదలను బట్టి చంద్రుడి వాతావరణం ఏమాత్రం సాంద్రంగా ఉన్నదీ కనిపెట్టవచ్చు.

మూడో దశలో: అయిదు అంచీలలో ప్రయాణించే రాకెట్టును చంద్రుడిలోకి పంపించాలి. ఆ రాకెట్ తనతో పాటు ఒక లాబొరేటరీ (పరిశోధనశాల)ని కూడా తీసుకుపోతుంది. ఇందులో మనుషులుండరు. భూమిమీదనించే దాన్ని కంట్రోలుచెయ్యవలసి ఉటుంది. అందులో ఒక టెలివిజన్ కామెరా ఉంటుంది. అది పంపించే సమాచారాన్నిబట్టి రాకెట్‌ను ఇక్కడ్నించే కం

(54-వ పేజీ చూడండి)

# వధూవరుల నాటకం

## కొంపల్లి బ్రహ్మానందరావు

గుంటూరు.

శ్రీ వెంకటరంగంగారికి :

మీతో నాకు పరిచయం లేదు. నేను అగ్రహారములో వుంటున్నాను. నా పేరు సుందరశివం. అపరిచయస్థులైనా మీకు ఈ లేఖ వ్రాయటం వింతగానే వుంటుంది. కాని అవసరం వచ్చింది కనుక, చనువు తీసుకుని వ్రాస్తున్నాను. చనువు మీరు కూడా పుచ్చుకుని సమానముగా నన్ను తలంచగలరని ఆశిస్తున్నాను.

వుత్తరం వ్రాయటానికి ప్రధాన విషయం వుంది. అది కేవలం నా విషయం కాదు. నన్ను గురించి అయితే బాధపడను. కానీ అవివాహితురాలయిన మా అమ్మాయి విషయం కావటాన చాలా బాధగా మీకు వ్రాస్తున్నాను. ఆడపిల్ల తల్లిదండ్రులు ఎన్ని బాధలకులోను కావలసి వస్తుందో ఆడపిల్లల్ని కలిగి వుంటేనేగాని తెలీదు. ఆడపిల్లతో ఇంటికి కళ వచ్చిందని ఆనాడు ఉబ్బితబ్బిబ్బులూగుతాం. మురిపాలు, ముచ్చట్లు చేసుకుని ఆనందిస్తాం. కానీ వయస్సుమీరిన తరువాత మనకు కలిగే బాధలు, దిగుళ్ళు, ఇంతా అంతా కావు. బహుశః మీకూ ఓ అమ్మాయి వుండి వుంటుందని తలుస్తున్నాను. అది నిజమయితే, వీటినిగురించి మీకు వేరే చెప్పనక్కర్లే దనుకుంటాను. ఎందుకంటే లోకములో అవివాహిత కుమార్తెను గలిగిన తల్లిదండ్రుల ఇక్కట్లు అందరికీ సమమే కాబట్టి.

ఈ సంవత్సరం మా అమ్మాయిని కాలేజీలో చేర్పించాను. నేనూ అంతగా వున్నవాడ్ని కాదు. కట్నాలు కానుకలూ ఇచ్చుకోలేనందున బి. ఏ., వరకు చదువైనా అమ్మాయికి చెప్పించకల్గితే ఏ పుణ్యాత్ముడినో అడగవచ్చని అనుకుంటున్నాను. కాలమూ, దైవమూ కలసివస్తే నా కోరిక నెరవేరి మా అమ్మాయి చక్కగా బతుకుతుందని ఆశిస్తున్నాను. కానీ మూడు నెలలయిందో లేదో కాలేజీలో చేరి, కొన్ని విషయాలు జరుగుతున్నాయి. చూడబోతే, గతరెండు మాసాలబట్టి జరుగుతున్నట్టు తోస్తూంది. కాలేజీ దారిలో కొంతమంది మగపిల్లలు, ఆడపిల్లలు దాన్ని ఏడిపిస్తున్నట్లు వింటున్నాను. మా అమ్మాయిని ఈ మధ్య ఒక విద్యార్థి కొంచెం గొడవ చేస్తున్నట్లు మా అమ్మాయే చెప్పింది. వాకబు చెయ్యగా ఒక విషయం తెలిసింది. తమరికి కోపం రానట్టయితే, మరేమీఅనుకోకుండా వుంటే ఆ విషయం మనవి చేస్తాను. ఆ కుర్రవాడు తెలీక చేసి వుండవచ్చును. అందుకు నేను కోపగించుకోవడం లేదు. అతను తమరి అబ్బాయి అన్నట్లు తెలిసింది. ఆడపిల్ల తండ్రిని అడుగుతున్నాను. వివాహమై వెళ్ళిపోవాల్సిన అమ్మాయి కాబట్టి ఎటువంటి మచ్చ లూ వుండకూడదు. మీ అబ్బాయిని కాస్త దండిస్తారని ఆశిస్తాను. చనువు తీసుకుని వున్న సంగతి వ్రాశాను. మన్నిస్తారని అనుకుంటూ,

ఇట్లు :

సుందరశివం.

గుంటూరు.

శ్రీ సుందరశివంగారికి :

మొన్న మీరు వ్రాసిన కవరు అందినది. దానిలోని విషయాలు గ్రహించాను. మీరు వ్రాసిన విషయం చదవగానే కోపంవచ్చిన మాట వాస్తవం. ఆశ్చర్యం, వింత కూడా కలిగింది. తమరు అనుకున్నట్లు మా వాడు పోకిరి వాడుకాదు. తుంటరి చేష్టలు వాడికి లేవు. మీ అమ్మాయిని గోల చేశాడంటే నమ్మలేకుండా వున్నాను. మా అబ్బాయి శ్రద్ధగాచదువుకుంటూ రెగ్యులర్ గా కాలేజికి వెళ్ళేవాడు కానీ, చెడుగా తిరుగుతూ ఆడపిల్లలను గేలిచేసేవాడుకాదు. ఆ సంగతి ఖచ్చితంగా చెప్తున్నాను. మీ అమ్మాయి మరెవరినిగురించో చెప్పివుంటుంది మీరు పొరబడి మా వాడ్నిగా తలంచి వుంటారు. ఆడపిల్ల తల్లితండ్రుల బాధలు గ్రహించిన వాడినే కాబట్టి, చనువు తీసుకుని నన్ను అడిగినందుకు, నేను మరేమీ అనుకోను. మీ అమ్మాయిని అల్లరిచేస్తూన్న వాడు మా అబ్బాయి కాదని మరొకసారి రూఢిగా తెల్పుతున్నాను.

ఇట్లు :

వెంకటరంగం

గుంటూరు.

శ్రీ వెంకటరంగంగారికి :

ఈ రోజునే తమరి జాబు చూచుకున్నాను. సంగతులు చదివి కొంచెం ఆశ్చర్యం పడినమాట వాస్తవం. నేను తొందరపడి ఒకరిమీద నిందవేసేవాడ్ని కాదు. బహు జాగ్రత్తగల మనిషిని. ఈ విషయం ఎవర్నయినా అడిగి తెల్సుకోవచ్చును. నిదానం నెమ్మది, ఓర్పుగల వాడినిగా మా మిత్రులు అంటూ వుంటారని గర్వముగా చెపుతున్నాను. అందుచేత మొన్న నేను వ్రాశిన విషయం చాలా రూఢిగా తెల్సుకున్న తర్వాతనే మీకు వ్రాశాను. గట్టి నమ్మకం లేనిదె మీలాంటి పెద్దమనుషులకు సాహసించి వుత్తరం వ్రాయగలనా ? ! ! కుర్రవాడు ఫలానావారి అబ్బాయని నాకు నమ్మకముగా తెల్సును. మీ జవాబు చూచుకున్న తర్వాత తిరిగి మా అమ్మాయిని వివరముగా అడిగాను. అది కూడా తమరి లేఖను చదువుకుని నవ్వుకుంటూ నాకు బాగా తెల్సునన్నగారు. అబ్బాయి వీరి అబ్బాయే అని, చెప్పింది. ఇందులో అబద్ధం ఏమాత్రం లేదు. కనుక అబ్బాయిని కాస్త అదుపు ఆజ్ఞలో వుంచుతారని ఆశిస్తున్నాను.

చనువుతోనే మీకు వ్రాస్తున్నట్టు గ్రహించారనుకుంటాను.

ఇట్లు :

సుందరశివం,

గుంటూరు.

శ్రీ సుందరశివంగారికి :

పనుండి విజయవాడ వెళ్ళి ఈ రోజునే వచ్చాను. మావాళ్ళు మీరు వ్రాసిన కవరు ఇప్పుడే ఇచ్చారు. మీలాగే నేనూ జాబును చూసి ఆశ్చర్యపోయాను. మా అబ్బాయి మీరు అనుకున్నట్టు ఆడవాళ్ళని గేలిచేసేవాడు ఎన్నటికీ కాడు. స్వభావాలు, గుణాలు తరతరాలనుంచి అలవడతాయి కనుక, మా కుర్రవాడు చాలా సుగుణవంతుడు. చెడుగా తిరిగేవాడు కాదు. అల్లరిపిల్లల స్నేహం లేదు. అయినా ఎందుకయినా మంచిదని ఆఫీసు రూములో కూర్చుని శ్రద్ధగా చదువుకుంటూన్న మా రామాన్ని పిలిచి ఈ విషయం అడిగాను. వాడు నవ్వుకుంటూ "నాన్నా ఇన్నాళ్ళబట్టి చూస్తున్నావు ! ఈ మాదిరి రిపోర్టులు నామీద ఎప్పుడయినా వచ్చాయా ఇదంతా అబద్ధం. కేవలం నిందమోపడం గాని, వేరేమీ లేదు. అసలు నా చదువేమిటో నేను చూచుకుండేవాడ్ని గానీ, కనీసం ఆడవాళ్ల కాలేజివీధి మలుపుకూడా

ఎన్నడూ తిరగలేదు.

మీరు చెప్తూన్న ఆ అమ్మాయి నాకసలు తెలీదు, అని చెప్పాడు. ఏమీ తెలీనివాడ్ని అనవసరముగా అడిగినందుకు నేనూ ఎంతో బాధపడ్డాను. అభాండాలు వేసేముందు ఆలోచించాలని మీకు మరోకసారి చెప్తున్నాను. మరోకసంగతి ఒకవేళ వేరొకరి పిల్లవాడు గొడవచేసినప్పటికీ, అదుపాజ్ఞలలో వుంచాల్సింది మీ ఆడపిల్లనుగానీ, పిల్లవాడ్ని కాదు. ఇది ముఖ్యంగా గ్రహించాలి.

మీ అమ్మాయికీ మా అబ్బాయికీ ఎటువంటి సంబంధమూ లేదు.

ఇట్లు,

వెంకటరంగం.

గుంటూరు,

శ్రీ వెంకటరంగంగారికి :

తమరి జాబు అందినది. మా అమ్మాయిని అదుపాజ్ఞల్లో వుంచుకోవాలనే విషయం నేనూ ఒప్పుకుంటాను. మా శారదని కోప్పడిన తర్వాతనే ఈ విషయం మీ దాకా తెచ్చాను. "రోజూ వెంటబడి గొడవచేసి ఏడిపిస్తూంటే నేనుమాత్రం ఏం చేస్తాను నాన్నా!" అంది. పోనీ కాలేజీ మానిపిద్దామంటే, సగంలో ఒదిలేస్తే డబ్బుకు డబ్బూ వృథా అవుతుంది. పెళ్లి కావలసిన పిల్లకు చదువూ వుండదు. చదువులేనిదే ఈ రోజుల్లో ఏ పిల్లవాడూ ముందుకు రాడు. అప్పటికీ రెండు రోజులు కాలేజి మానెయ్యమన్నాను. కాని ఏమి ప్రయోజనం? మూడోరోజునుంచి యథాప్రకారం వెంటవస్తున్నాడట. మా అమ్మాయికి మీ జాబు చూపించాను. పోనీ పొరపాటుపడి వుంటావు. సరిగా కనుక్కోవే అన్నాను. మా పనికుర్రవాడ్ని పంపించి అతని ఇల్లూ అది కనుక్కోమని చెప్పిందట. అతను మీ ఇంట్లోకే వెళ్లాడట. బయట ఎవర్నో అడిగితే ఆ అబ్బాయిగారు మీవాడేనని తెల్సింది. ఆ తరువాతే మా అమ్మాయి నాకు చెప్పింది. ఇంక ఆ కుర్రవాడు మీవాడేనని అంతకన్నా రుజువు కావాలా?

మరోకవిషయం. మా అమ్మాయి 'వర్షన్' ప్రకారం ఓ రోజున కాలేజికి వెళ్తూంటే కాన్వెంటు దగ్గర వెనకాలే ఓ కుర్రవాడు సైకిల్ మీదవస్తూ మా అమ్మాయికి కావాలని 'డేష్' కొట్టబోయి, తనే క్రిందపడినట్టు, అందుకు మా అమ్మాయి ఎగతాళిగా నవ్వటం జరిగినందున అతనికి హేళనజరిగినట్టు భావించి కోపావేశాలు ఆవహించినట్టు అప్పటి లగాయతూ మా అమ్మాయిమీద కసిబూనినటూ తెలుస్తోంది. కావాలంటే ఈ విషయం మీ రామాన్నడిగి రూఢి పర్చుకోవచ్చు.

జరిగిన సంఘటనకు చేసేదేమీ లేదు కనుక, ఇకనుంచయినా దయవుంచి మీవాడ్ని మా అమ్మాయిజోలికి రావద్దని హెచ్చరిస్తారని తలుస్తాను.

ఇట్లు,

సుందరశివం.

గుంటూరు.

శ్రీ సుందర శివంగారికి:

నిన్న మీరువాశిన వుత్తరములో కూడ దోషం అంతా మారామం మీదనే పెట్టి ఏదో మీ అమ్మాయి చాలా మంచిదన్నట్టు చెప్పుకున్నారు. చాలా సంతోషం! మగపిల్లలనేకంటే మీ అమ్మాయిని దండించమని మరోసారి హెచ్చరిస్తున్నాను. మావాడు సైకిలు 'ఢీ' కొట్టాలని ప్రయత్నించడం క్రిందపడ్డాడనడం ఇదంతా కేవలం కట్టుకథగా కనిపిస్తోంది. నాన్నా నాకు క్లాసు తప్పకుండా వస్తుందని, చాలా బాగా చదువుతున్నానని మారామం పదే పదే నాతో చెప్తూంటే ఈ గొడవలు ఈ అల్లర్లు చేసేందుకు టైము ఎక్కడ వుంటుందో అనూహ్యం. అపవాదులు, నిందలు వెయ్యటమే కాని ఆలోచనలేకుండా ప్రవర్తిస్తున్నారు. మేడమీద గదిఇచ్చి, చక్కగా చదువుకోమని మావాడికి ఈనాడు చెప్పటం కాదు. గత రెండేళ్ళపైగా వాడి బాధ్యత వాడు గ్రహించి శ్రద్ధగాచదువుకుంటూంటే వాడిపైన ఈ అభాండం వెయ్యటం ఇకచాలించమని, అలాగాకుండా ఇది ఈ మాదిరే కొనసాగితే, పరువునష్టం దావావేసి, నష్టపరిహారము క్రింద పదివేలు రాబట్టగలనని

# ★ వధూవరుల నాటకం ★

ఇందుమూలముగా మీకు తెలియజేస్తున్నాను.

వయస్సువచ్చిన కొడుకును ఆడపిల్లను గురించి ఇన్నిసార్లు అడగటం నాకు డెలికేటుగా వున్నందున మీకటుకథలను గురించి మరోకసారి అడగ తల్చుకోలేదు.

ఇట్లు
వెంకటరంగం
గుంటూరు.

శ్రీ వెంకటరంగం గారికి:

మీ తీవ్రమైన లేఖ అందినది. ఈనాటి పిల్లలుచేస్తూన్న కార్యకలాపాలుగాని, వారి తెలివి తేటలుగాని పరికిస్తూంటే రోజులు ఎంతగా మారారో విశదమవుతోంది. అమోఘమైన ఆలోచనలు, తీపికబుర్లు అనుమానం కల్గించని అబద్ధాలు, జాలీ, దయ పుట్టించే ముఖాలూ మన్ని బుట్టలో వేసుకుంటున్నాయి. ఇంతకీ విన్న జరిగినసంగతి వ్రాస్తే మీరుకూడా నాతో ఏకీభవిసారు. ఏదో మంచిఇంగ్లీషు పిక్చరు వుందంటే అలా క్లబ్బునుంచి స్నేహితులం నల్గురమూకలసి థియేటరుకు వెళ్ళాం. వదిలిపెట్టినతరువాత వస్తూంటే మా అమ్మాయి కన్పించింది. వాళ్ళ స్నేహితురాళ్ళతో వచ్చిందనుకున్నాను. తీరా వెనకాతే ఓ యువకుడు వస్తున్నాడు. నాకు అనుమానమూ, ఆగ్రహం వేసింది. నేనే అడగబోతూంటే, క్షమించండి నాన్నగారూ ఇంట్లో అన్నీ సవివరముగా చెప్తాను—" అంది.

ఇంటికిరాగానే చాలా కోపంగా అడిగాను. మా అమ్మాయిమీద అంతకోపం ఎన్నడూ రాలేదు. ఆ అబ్బాయి ఎవరో కాదని, వెంకటరంగం గారబ్బాయి రామం అని, తమిద్దరూ ప్రేమించుకున్నామని చెప్పింది. మరి ఇన్నాళ్లు ఎందుకు చెప్పలేదు? అని అడిగాను. వివాహానికి అంగీకరించరేమోనని కొంత అడావుడి, హంగామాలు జరిగితే అడ్డువుండదేమోనని ఇద్దరూ కలిసే ఈనాటకం ఆడారని తెల్పింది. మొదట్లో దాన్ని చాలా కోప్పడినా, ఇంక అయిందేదో అయిపోయిందని శాంతించాను. మీ రామం, మా అమ్మాయితో మా ఇంటికివచ్చాడు. నిజమా నాయినా అని అడిగాను. అంతా నిజమన్నట్లు నవ్వుతూ చెప్పి ఈ విషయం తమకివ్రాసి ఎలాగయినా వివాహానికి ఒప్పించమని వేడుకున్నాడు.

వెంకటరంగంగారూ, అందుచేత ఇపుడు జరగవలసిన కార్యక్రమం ఏమిటి? ఆలోచిస్తే వివాహం చెయ్యటమే మేలుగావుంది. ఏమంటారు?

ప్రేమించుకున్న వారిని ఇద్దర్ని విడదీయటం ప్రమాదం. ఆసంగతి ఒప్పుకుంటారనుకుంటాను. ఒక్కర్తే అమ్మాయి కాబట్టి, వివాహం కూడా వైభవంగా చెయ్యాలని తలంపు. అందులో తమ బోటి వారితో సంబంధం అంటే నా అదృష్టం కూడా. ఇంతకూ నా అభిప్రాయం వివాహం చేస్తే బాగుంటుందని. పరువునష్టం క్రిందపరిహారం మీరడిగిన పదివేలూ, వరకట్నం క్రింద దీంతోనే చెక్కుగా పంపిస్తున్నాను. నామీద దయవుంచి స్వీకరిస్తారని తలుస్తాను.

అనవసరముగా, అభాండాలు, అపనిందలూ ఆలోచనలేకుండా, ఇంతకు పూర్వం వ్రాసిన వుత్తరాలలో నిందించినందుకు క్షమించమని వేడుకుంటున్నాను.

అనుకూలమైన జవాబుకు ఎదురుచూస్తూ,

ఇట్లు మీ
సుందర శివం.

సుందరశివంగారికి:

మీ జాబును చూపించి మావాడ్ని నిలదీసి అడిగాను. అంతా నిజమేనని ఒప్పుకున్నాడు. ఆసంగతి మొదట్లో చెప్పివుంటే ఎంతో బాగుండేది. వివాహం జరిపించివుండేవాడ్నికదా అంటే, సిగ్గుపడ్డానన్నాడు. పోనీలెండి. నాదిగులేమిటయ్యా అంటే పోస్టు ఖర్చులక్రింద చాలా పోయిందేఅని! ఏమంటారు?

గత రాత్రి రామం ఇంట్లో కన్పించలేదు. గదిలో లైటు మాత్రం వేసేవుంది. ఇలాచదువుతున్నాడని ఇపుడు అర్థమయింది. ఇంకా శ్రద్ధగా చదువుకుంటున్నాడనుకున్నా.

వరకట్నం క్రిందపంపిన నష్టపరిహార పు చెక్కుని చెరోక ఐదువేలు పెళ్ళికానుకల క్రిందమీరే వధూవరులకు ఇచ్చి దీవించండి.

ముఖాముఖి రేపే కల్సుకుని శుభముహూర్తం నిర్ణయిద్దాం.

ఇట్లు
వెంకట రంగం.






# నరకుని ఎదిరించిన నారి

వీరశృంగార భయరౌద్ర విస్మయములు
గలసి భామిని యయ్యెనో! కాకయనఁగ
విషువుఁ దొడగుట దివుచుట యేయుటెల్ల
తెలియఁగ రాకుండననిసేసె! నిందువదన
హర్షదాయియై మహా రోషదాయియై
పరఁగు ముద్దరాలి బాణవృష్టి
వారికి నరికిఁజూడ నందంద శృంగార
వీర రసములోలి విస్తరిల్లు

* * *

ఆమె సమరభూమిలో నిలచిన సత్యభామ. నరకాసురుని ఎదిరించి పోరిన వీర నారి. వారికి ఆమె శృంగార దేవతలా గోచరించింది; శత్రువుకు వీరవనితగా కనబడింది. ఇలా, వీర, శృంగార, భయ, రౌద్రాలు కలసి రూపొందిన భామగా ఆమెను చూపిన కవి పోతనామాత్యుడు.

భూదేవి పుత్రుడు నరకాసురుడు లోక కంటకుడై యథేచ్ఛగా విహరిస్తున్నాడు. అపుడు శ్రీ కృష్ణుడు నరకాసురసంహారానికి బయలుదేరాడు. సత్యభామ తానూ వస్తానంది. సమర రంగంలో తన స్వామి ప్రతాపాన్ని చూచి ఆనందించి, తోటిదేవేరులకు స్వయంగా వర్ణించి చెప్పాలని ఉత్సాహపడింది. అందుకు శ్రీ కృష్ణుడు నవ్వి, యుద్ధభూమిలో స్త్రీలు నిలువలేరని, ఆమె రాదగదని వారించాడు. కాని సత్యభామ పట్టు వదలలేదు. చివరకు కృష్ణుడామెను వెంట తీసుకొని వెళ్ళాడు.

ఘోరా ఘోరీగా పోరాటం సాగింది. కృష్ణుడంతటివాడు అలసి, సొలసి, సొమ్మసిలి పోయాడు. ఆ క్షణాన సత్యభామ ముందు నిలచింది. ఆమె చిన్నతనంలో పుట్టింట విలువిద్య నేర్చి, అందులో ప్రావీణ్యం గడించింది. ఇపుడు ఆ విద్య ప్రదర్శించే అవకాశమూ, దాని అవసరమూ కూడా వచ్చాయి. విల్లమ్ములు ధరించి, శత్రుసేనను శరపరంపరతో ముంచెత్తివేసింది వీరనారి సత్యభామ. వారిలో అలజడి కలిగించింది. "వీర శృంగార భయరౌద్ర విస్మయములు కలసి భామిని యయ్యెనో" అని ఆమెను చూచినవారు విస్మయచకితులు అయ్యారు.

అంతలో శ్రీ కృష్ణుడు తేరుకొని, సత్యభామతీరుగని, విల్లమ్ములందుకొని విజృంభించి నరకాసురుని సంహరించివేశాడు.

మనమందరం సత్యభామలా అతురాలా విల్లమ్ములు పట్టుకొని యుద్ధాలు చేయనవసరం లేకపోయినా, సాహసానికీ, స్థైర్యానికీ ఆమెను చిహ్నంగాఎంచి, మన నిత్య జీవితాలలో తటస్థపడే సమస్యలను ఎదుర్కొని నిలువగలశక్తి సంపాదించాలి. ఈ

**ఎస్. వి. రమణకుమారి**

పండుగనాడు సత్యభామ కథ మనకిచ్చే నీతి సుధ అదే.

* * *

ఆనాడు లోక కంటకుని మరణము చూచి దేవతలు ఆనందభరితులై పుష్ప వర్షము కురిపించారు. భూలోకవాసులు వైభవంగా విజయోత్సవం జరిపారు. ఇంటింటా పండుగ చేసుకున్నారు.

నరకుడి పీడ విరగడైంది, అని ఆనందించారు. ఆనాటి నుండి ఏటేటా ఆశ్వయుజ మాసంలో కృష్ణపక్ష చతుర్దశిని నరక చతుర్దశి అని పిలువసాగారు. ఆరోజు అభ్యంగనం ఆచరించి పిండివంటలతో పండుగ చేసుకుంటారు. ఆ మర్నాడు దీపాలతో,బాణసంచాతో దీపావళి పండుగ చేసుకుంటారు.

దక్షిణ భారత దేశంలో ఈ పండుగ రెండు రోజులేకాని, ఉత్తర హిందుస్థానంలో ప్రజలు రమారమి నెల రోజులు జరుపుతారు. మనము దీన్ని దీపావళి అంటాము. వారు దివాలీ అంటారు. అక్కడ పండుగలకు రంగురంగుల ముగ్గులతో, దీపాలతో ఇళ్లు వాకిళ్ళను నేత్రోత్సవముగా అలంకరిస్తారు. దీపావళినాడు ధనలక్ష్మి పూజ చేస్తారు. తరతరాలుగా తమ ఇళ్ళలో పదిలంగా ఉంచుతూ వచ్చిన పాతనాణాలను ఆరోజున పైకితీసి వెండి బంగారాలతో కలిపి పూజలు చేస్తారు. బంధుమిత్రులను ఆహ్వానించి, ఫలపుష్పాలిచ్చి సత్కరిస్తారు. అన్ని పండుగలకన్న దీనికి వారు విశేషంగా డబ్బుఖర్చు చేస్తారు.

అన్ని ప్రాంతాలలోను, అందరు తప్పకుండా చేసేది ఒకటి ఉంది - బాణాసంచా కాల్చడం. ఈ పండుగనాడు దేశమంతటా కొన్ని లక్షల రూపాయల బాణాసంచాను వెలిగిస్తారు. కొందరిదృష్టిలో ఈచర్య కేవలము ధననాశనకారి. అయితే అందరికీ ఇది ఆనంద దాయకమే. కొన్ని పండగలు ప్రజల ఆనందంకొరకే ఏర్పరుపబడినవి. ఆయాపండుగలలో బీదా గొప్పా అనేభేదములేకుండా, అందరూ తమ తమ శక్తినిబట్టి ఉన్నంతలోనే ఉత్సాహముగా ఆనందముగా పండగ చేసుకోవాలి. అనాదిగా ఇవి అలాగే జరుగుతున్నాయి కూడా. ఒకరు చేయాలి అని చెప్పితే చేసేవి కావు పండుగలు. వద్దంటే మానేవి కావు.

విఘ్నేశ్వరుని పూజిస్తే విఘ్నాలు కలుగవని, సరస్వతిని పూజిస్తే చదువులు అబ్బుతాయనీ, లక్ష్మిని పూజిస్తే సంపదలు కలుగుతాయనీ నమ్మకం వున్నందువల్లనే ప్రజలు అందరూ ఏటేటా ఈపూజలూ, ఉత్సవాలూ జరుపుతున్నారు. వీటివల్ల ఏటికొకసారేనా చుట్టపక్కాలు అందరూ కల్సుకోవడం, ఆరోజు నైనా కష్టాలు మరిచిపోయి సంతోషంగా వుండడం జరుగుతోంది. దీపావళి వీటిలో ఉత్తమమైనది. పిల్లలూ పెద్దలూ కూడా ఒక్కలా జరుపుకునే పండుగ.

ఆరోజున దీపాలు వెలిగించి చీకట్లనుతరిమివేస్తే, వాటిమాటునఉన్న దారిద్ర్యంకూడా తొలగిపోతుందని నమ్మకం. పోతే, బాణాసంచా కాల్చడంవల్ల క్రిమికీటకాలు నశించి, ఊరూవాడా శుభ్రపడుతుందని చెబుతారు. ★



మన తప్పనిసరి:

# మాట పట్టింపులు

మనకు నిత్యం అనేకరకాల మన స్తత్వాల వారు అనేక రకాల మాటకారులు కనుపిస్తుంటారు.

తాహతుకు మించిన కబుర్లు చెప్పుతూం టారు సంపంగినూనెవారు. ఎదుటివార్ని చిన్నతనం చేస్తారు తామే గొప్పవారను కున్నవారు. ఎదుటివార్ని పరిహసిస్తూ మాట్లాడుతారు హాస్యప్రియులు.

ఆడవారిలో నూటికి 90 మంది దగ్గర కనుపించేఅలవాటుఏమిటంటేపక్కా మెనుపలకరిస్తూనే"ఈపూట కూరేమిటి"అని అడగడం. ఆ ప్రశ్నకు సమాధానం ఇవ్వకూడదనే నా అభిప్రాయం. ఆ విషయంలో ఒకటి రెండు ఆధరువులుచాలు కొంతమందికి. కొంతమందికి ఆర్థికస్తోమతు వుండదు. కొంతమందికి తెచ్చేవారు వుండరు. ఖర్మంచాలక ఆ రోజు ఇంట్లో ఏమీకూరలేక వీధిలోకి అమ్మరాక కూరలేకపోవచ్చు. ఎన్నో సమస్యలుంటాయి. అల్లాంటి విషయాన్ని పైవాళ్ళు ప్రశ్న వేసే ఎవరేమనుకున్నా ఫరవాలేదనే ధీమాతో వున్నవారైతే నిజం చెప్పుతారు గాని చాలమంది "పచ్చడి, చారు" అని చెప్పలేరు.

ఒకమాటు ఒక ఆవిడను ఎవరో ఈప్రశ్న వేశారు. దాంతో ఆవిడ తడుముకోకుండా 6 కూరలు, 4 పచ్చళ్ళు, సాంబారు, చారు, మొత్తం 12 రకాల వివరాలు గుర్తులేవు అని చెప్పింది.

## 'ఉన్న'తనం-చిన్నతనం

ఎదుటివార్ని కించపరుస్తారు. ఇక్కడ కూడ కూరలగొడవ వచ్చి ఏం వండుకున్నారని అడుగుతారనుకోండి "ఏమీ లేకపోయిందండి" అని ముక్తసరిగావున్నమాట చెప్పితే ఇంక అడిగినవారి ధోరణిచూడండి, "ఎల్లా తింటారమ్మా పప్పు, చారుతోనూను. మా ఇంట్లో అల్లా తినలేము. ఒక పప్పుకూర. ఇగురుకూర రెండు వేపుడు కూరలు రెండు పచ్చళ్ళు, రెండు పులుసులు కావాలి. అప్పడంగాని, వడియంగాని లేందే అసలు అన్నంతిన్నట్లే వుండదు."

"నిజానికివారింట్లో-అంతేకావచ్చు కాని మాట్లాడేటప్పుడు ఎదుటివార్ని చూచి ఆలో

**పాకల సీత**

చించుకుని మాట్లాడాలి. ఆవిడ రెండే చెప్పారు. మనమాట ఇప్పుడే చెప్పడం ఎందుకు అనుకోవాలి.

జపానికి కావాలని వీధులో పగడాలు కొంటుంటే ఒక శ్రీమంతురాలువచ్చి 'ఎందుకమ్మా ఈ పగడాలు, ఇవి ఒక పగడాలేనా "గతిలేనమ్మకు గంజేపానకం మరి" అంది దురుసుగా. ఆవిడని నేను పగడాల బేరంలో పిలవలేదు. అంతక్రితం ఆవిడనుఎరుగను. అంతక్రితంరాత్రే పక్కవాటా వారింటికి వచ్చిన చుట్టంట ఆవిడ, ఆబేరంలో ఆవిడకు ఏమి సందర్భం లేకపోయినా ఆవిడ గొప్ప చూపించుకుంది.

ఇల్లాగే ఇంకొక సందర్భంలో అరుగు మీద పొయ్యివేసుకుని వండుకుంటే బాగుంటుందా? లేదా అని మీమాంసమీద నల్గురైదుగురు వారివారి అభిప్రాయాలు చెప్పి, చర్చసాగిస్తున్నారు. ఈ అరుగు కొంచెం ఎత్తు అయింది కనుక దీని మీదనుంచి అన్నం గిన్నె దింపడం కష్టం అన్నాను. అందులో ఒక ఆవిడ "బ్రిక్వుంటే సరి" అని సలహా ఇచ్చింది. "దేనికైనా బ్రిక్ కావాలి గాని. పొయ్యిమీద గిన్నెదింపడానికి అక్కరలేదు నేలమీద పొయ్యి అయితే ఎంతపెద్ద గిన్నె అయినా వంగుని దింపవచ్చు. ఎత్తుమీద నున్న గిన్నెదింపడం కష్టం అంటే అదైనా ఆ అరుగు కొంచెం ఎత్తుఎక్కువయింది కదా అందుచేత" ఆవిడ నాకు ఇచ్చిన సలహా.

## మాటకి మాట

ఒకమాటు ఐదారుగురం కూర్చుని వుండగా అందులో ఒకావిడ ఇంకొక ఆవిడను వదినగారివరుసపెట్టి హాస్యధోరణిలో "ఏమండీ మా అన్నగారు మిమ్మల్ని ఎల్లా పెళ్ళిచేసుకున్నారండీ" అంది. ఆయన అందానికి ఆవిడ తగదు అన్నట్లు.

వెంటనే ఆవదినగారు "ఎల్లా పెళ్ళిచేసుకున్నా సాయంకాలం దాటితే మీ అన్నగారు వీధిలోకి వెళ్ళరు. రోడ్డుమీద తలపైకెత్తరు" అంది. ముందు ఆవిడభర్త మంచివాడుకాదు. తిరిగి ఆవిడమాట ఆవిడకే తగిలింది.

ఇంకొక రకంవారున్నారు వారే 'యథార్థవాది, బంధువిరోధి' అనుపించుకోనేకోరుమనుషులు. మనసు మంచిదే అయినా ఉన్నమాట అనెయ్యడమే కాని ఎదుటివారు బాధపడుతారేమోనని ఆలోచించరు: లోతుగు ఆలోచించుకుంటే పూరుకోగలరుగాని వెంటనే మొహంమీదవున్న మాట అనేస్తారు.

ఇంకొకరకం వారు సంఘానికి చాలా ఉపకారస్తులు. వారెవరంటే అతిముభావం ఎవరేమన్నా ఏ విషయం మాట్లాడుకుంటున్నా అనవసరంగా మాటలు కలపరు. ఇది మంచి ఇది చెడ్డా అనరు. ప్రతిదానికి ముభావంగా వుంటారు. వారు సర్వత్రా మంచివారే.

కొంతమంది వచ్చికూర్చున్నది మొదలు ఎదుటివారి గుట్టులాగుతూ హేళనచేస్తూ తమ గొప్ప చెప్పుకుంటూ వుంటారు.

ఇట్లాగ అనేకరకాల సంభాషణలు జరుగుతున్నప్పుడు పొరపాటున, తెలియనితనంచేత, ఏదైనా మాటమీరివచ్చినట్లయితే పెద్దపట్టింపులు లేక సర్దుకుపోతుండాలి. చిన్న విషయాలకు పెద్ద తగాదాలు తెచ్చుకోకూడదు. స్నేహం, బంధుత్వం వృద్ధిచేసుకోవాలంటే మాటపట్టింపులు లేకుండా మంచిపోవాలి. ★










ఈ డిజైను, టేబుల్ క్లాత్ మూలల్కి, దిండు గలీబులకి రేడియోమీద కప్పే గుడ్డ మూలలకి, కుర్చీ బాక్ కవర్సుకి (మూలలయందే) బాగుంటుంది.

—డి. లక్ష్మి (న్యూఢిల్లీ

# నిమ్మకాయలు నిల్వచేయడం

నిమ్మకాయలు ఒకేసారి కొని నెల నెల పదిహేను రోజులు నిల్వ వుంచవచ్చును. నిమ్మరసం ఎందులో వాడినా బావుంటుంది.

ఒక గంపనిండా శుభ్రమైన ఇసుక తెచ్చి గదిలో ఒకమూలగా పొయ్యాలి. గంపలో సగం ఇసుక క్రింద బోసి చదరంలా పేర్చి పైన మనకు ఎన్ని కాయలు అవసరమో అన్ని పేరవాలి. గంపలో మిగిలిన ఇసుక అంతా కాయలపైన పోసెయ్యాలి. నిమ్మకాయలు కనబడకుండా ఇసుక అంతా పొయ్యాలి. రోజు ఒక చెంబు నీళ్ళు ఇసుక అంతా తడిసేలా చల్లుతూండాలి. ఈవిధంగా రోజు నీళ్ళు చల్లుతూంటె ఒకసారి పెట్టిన కాయలు నెల పదిహేను రోజులవరకు పాడవకుండా ఉండును.

ఇసుక అదీ తేలేని వాళ్ళు ఇంకోవిధంగా చేయవచ్చు. ఈవిధంగా కొంచం తక్కువ రోజులు ఉండును. అంటే ఇరవై రోజులు మాత్రం నిల్వవుండ గలవు. ఒక వెడల్పు మూతిగల డబ్బా తీసుకొని దానిలో చల్లటి శుభ్రమయిన నీరు

యం. రాధాశ్రీధర్

పొయ్యాలి. డబ్బాలో పట్టినన్ని నిమ్మకాయలు వేసి మూతపెట్టాలి. రోజు ప్రొద్దున పాతనీరు దీసి క్రొత్తనీరు శుభ్రమయినవి పోస్తుండాలి. ఈవిధంగా కూడా చేయవచ్చు. కాని చాలారోజులు ఉండవు.

నిమ్మకాయలు ఎండిపోయిన పక్షంలో ఒక మోస్తరు ఉడుకు నీళ్లలో అర్థగంట ఉంచి తీసిన ఎండిపోయిన రసం అంతా వస్తుంది. ఈవిధంగా నారింజ బత్తాయి దబ్బపళ్ళను గూడా రసం దీయవచ్చు. నిల్వ వుంచవచ్చును.

## కొన్ని సలహాలు

చెవిలో పోటు వచ్చి, లేకపురుపు అయి బాధపడేవారికి కొంచెం రసకర్పూరం ఒక నిమ్మకాయ డిప్ప రసంలో రంగరించి పోస్తే అయిదు నిమిషాలలో నయం అవుతుంది. పుండుగూడా మానిపోతుంది.

చేతులకు బొగ్గుగాని ఇంకేదేనా మరకలు అయితే నిమ్మరసం చేతిలో పోసుకుని బాగా రుద్ది, శెనగపిండితో కడిగితే సరి. చెయ్యి ఎప్పటిలా మృదువుగా ఉంటుంది.

ముఖంమీద మొటిమలున్నాకాస్త పసుపు వస్త్రకాళితంచేసి నిమ్మరసంలో ముద్దగా తడపాలి. ఒక గంటకు స్నానంచేస్తామనగ ఈ పుసుపుముఖంమీద బాగా రుద్దాలి: అర్థ

(39-వ పేజీ చూడండి)



# దీపావళికి పిండివంటలు

దసరా వెళ్ళిందికదూ! ఇహ దీపావళికి స్వాగతం ఇవ్వాలి మనం. దీపావళికి తప్పకుండా ఏదో తీపి పిండివంట చేసుకోవాలి. అది మొదటనుండి వస్తున్న మన ఆచారం. పిల్లలు దివిటీకొట్టాక తీపి తినాలంటారు. అందుకోసం నేను ఒక హాట్ రెండు స్వీట్సు చెప్తున్నాను. ఇవి ఎంతో చౌకలో తయారు చేసుకోవచ్చు.

## గేహూబాత్

ఇది హాట్ — కావలసినవి:

గోధుమరవ్వ పావుశేరు, పచ్చిమిరపకాయలు 4, అల్లంచిన్నముక్క, జీడిపప్పు, కరివేపాకు, తిరుగమూత సరుకులు నిమ్మకాయలు 3, ముందు ఒకగిన్నెలో కొంచెం నెయ్యి వేసి గోధుమరవ్వ ఎంతో అంత నీళ్లు పోయాలి. అంటే రవ్వ పావుశేరు అయితే పావుశేరు నీళ్ళుపోయాలి. అందుకు తగ్గ ఉప్పువేసి నీళ్లుమరగనిచ్చి అందులో రవ్వ పోసి సన్నసెగని మగ్గనిచ్చేయాలి. అప్పుడు చక్కగా మగ్గిన గోధుమ అన్నమును ఒక ట్రేయి పళ్లెముగాని లేకపోతే కంచములోకి దిమ్మరించేయాలి. అందులో పులిహోరకు వేసినట్లు కాస్త పసుపు కొంచెం మూసవేసి కరివేపాకువేసి గరిటెతో వాలు పూలలా కలపాలి. ఇంతలో ఇటుకుంపట్లో బాణలివేసి ఒకగిన్నెడు నూనెపోసి అందులో వాల్గు ఎండుమిర్చి, కాస్త శనగపప్పు, మినపప్పు, ఆవాలు, శనగబద్దంత ఇంగువవేసి పోపు వేగనిచ్చి ఈ గోధుమ అన్నంలో వేసి కాస్త జీడిపప్పు గూడ వేయించి కలపాలి. నిమ్మకాయలు మంచివి అయితే రెండో, మూడో మనం తినే పులుపునుబట్టి పిండుకోవచ్చు. చల్లారాక చక్కగా వాళ్లు మూలలా కలియపెట్టి-చేతోటి అయితే చక్కగా కలుస్తుంది- అప్పుడు ఏదైనా గిన్నెలో నొక్కిపెట్టి ఒకగంట పోయాక తింటే ఘుమ ఘుమ లాడుతూ బాగుంటుంది.

## కర్‌దంట్

ఇది స్వీట్ — కావలసినవి బజారులో అమ్మేది వేయించిన శనగపప్పు 1 పావుశేరు చక్కెర 1పావుశేరు, నెయ్యి చిన్న గిన్నెడు, జీడిపప్పు, ఏలకులు, కాస్త ఎండు కొబ్బరికోరు, పచ్చకర్పూరం కాస్త.

మైసూరుపాకుకు కావలసినంత నెయ్యి పొయ్యనక్కరలేదు. తేలికతో అవుతుంది. బజారు శనగపప్పు చక్కగా విసరాలి. మెత్తగా వుండాలి పిండి. పంచదార పావుశేరు ముదురుపాకంపట్టి అందులో ఈ పావుశేరు శనగపిండి పోసి కలియపెట్టాలి. అదివరకే వేయించుకొన్న జీడిపప్పు ఏలకపొడి కొబ్బరికోరు అన్నివేసి, ఒక పళ్ళెమును వాల్గు స్పూన్ల నెయ్యి రాసి పళ్ళెములో దిమ్మరించి వేడిమీదే చాకుతో కావలసిన ఆకారంతో కోసుకోవాలి. వేసుకొనే వాళ్ళు కొంచెం సోడాఉప్పు పాకంలో వేసుకోవచ్చు.

కావూరు లలిత,
సూర్యభవనం వెంకట్రావుపేట, ఏలూరు.

* * *

## ఘివర్ కాజా

కావలసిన వస్తువులు: పావుశేరు మైదా పిండి, పావుశేరు నెయ్యి, అర్థపావు చక్కెర.

తయారుచేయుట: మైదాపిండి జల్లించుకొని దానిలో కొంచము నెయ్యివేసి తదుపరి నీళ్ళుపోసి పూరీలపిండి మాదిరిగా కలుపుకొని పావుగంటసేపు వుంచి తరువాత రొట్టెల పీటకర్ర తీసుకొని, నిమ్మకాయంత వుండలు చేసుకొని పూరీమాదిరిగా వత్తి దానిపైన అంతట నెయ్యిరాయాలి. అది అట్లాగ వుంచి వేరపూరి ఈ మాదిరిగానె వత్తుకొని దానిపైన కూడా నెయ్యిపూసి ఒకదాని నెయ్యి వేరొక దానికి అంటినట్లుంచి కొద్దిగా వత్తి దానిపైన కూడ నెయ్యి రాసి ఈప్రక్కనుండి 1 అంగుళము ఆప్రక్కనుండి 1 అంగుళము వెడల్పుగా మడచిన చివరకు అంతా ఒకదగ్గరకలసిపోవును. అది పొడవుగా వత్తుకొని అనగా పూరీ అంత పలుచగా వచ్చువరకు వత్తవలెను. చివరకు దీనిని చాకుతో 2 అంగుళములు పొడవు 2 అంగుళములు వెడల్పు ముక్కలుగ కోసుకోవలెను. అన్నియు వత్తుకొని కోసుకొనిన పిమ్మట పొయ్యిమీద బాణలి వేసుకొని పొయ్యి సన్నని మంట చేయాలి బాణలిలో నెయ్యిపోసి అది కాగగానే ఈ కాజాముక్కలన్నియు వేయించుకోవాలి. తదుపరి పొయ్యిమీద గిన్నె పెట్టి తగు మాత్రము నీరుపోసి చక్కెరవేయవలెను. అది తీగ పాకము రాగానే ఈ కాజాలన్ని దానిలోపోసి అంతటా కలపవలెను. 5 నిముషములు పొయ్యిమీద వుంచి తదుపరి క్రిందకు దించి వేయవలెను. చూచుటకు చాలా బాగుండును. తినుటకు చాలా రుచిగా వుండును. 10 రోజుల పాటు వుండును పిల్లలకు జబ్బుచేయదు.

## జున్ను లడ్డు

కావలసిన వస్తువులు:
అర్థపావు జున్ను
పావుశేరు గోధుమరవ్వ (తెల్లది)
అర్థపావు చక్కెర
అర్థపావు నెయ్యి.

సాయంకాలము 8 గం|| చేసుకుంటే ఉదయము జున్నులో రవ్వ బాగా కలిపి వేయాలి. తదుపరి మూత పెట్టివుంచవలెను. 8 గం|| సాయంకాలము పొయ్యిమీద బాణలివేసి అందులో ఈ అర్థపావు నెయ్యి పోసి ఈ జున్నురవ్వ కలిపినది ఉసిరికాయలంత ముద్దలుగాచేసి వేయించుకోవలెను. అన్నియు వేయించినపిమ్మట గాలి తగులకుండా మూత పెట్టవలెను. తరువాత చక్కెర తీగపాకంపట్టి ఈ వుండలన్నీ అందులోపోసి బాగా కలుపవలెను. పిమ్మట క్రిందకుదించి మూత పెట్టవలెను. గులాబ్ జామ్ రుచి వచ్చును. ఖర్చుకూడా ఎక్కువ కాదు. 2 రోజులు మాత్రమే వుంటాయి.

యన్. శశికళ
(మహబూబ్‌నగర్)

* * *

## శర్కర్‌ఖండ్ పాంతువా

కావలసిన సామాన్లు: అరవీశ బంగాళా దుంపలు, ఒకకప్పు కోవా, మూడుపావుల పంచదార, 4 టేబుల్‌స్పూనులు బియ్యం, పావుతులం యాలకులు (పొడిచేసి వుంచుకోవాలి), ఒక కొబ్బరికాయకోరు, తులం జీడి పప్పు, తులం క్రిస్‌మస్, పావుశేరు నెయ్యి.

బియ్యంలో రాళ్ళులేకుండా చూచి కడిగి నానవేసి వుంచాలి. పావు పంచదార,



కొబ్బరి కలిపి వెడల్పాటి గిన్నెలో వేసి పొయ్యిమీదపెట్టి జాగ్రత్తగా కలుపుతూ ఉండాలి. బాగా వుడికి వుండ కట్టటానికి వచ్చినట్లుంటే దించి చల్లారబెట్టాలి. జీడిపప్పు సన్నగా తరిగి కళాయిలో నెయ్యివేసి జీడిపప్పు క్రిస్‌మిస్ విడివిడిగా వేసి కొబ్బరి లవుజులో కలిపి యాలకులపొడి సగం, కోవాముద్ద సగం వేసి వుంచుకోవాలి. తెల్ల దుంపలు శుభ్రముగా కడిగి వుడకబెట్టి వలచుకొని, రుబ్బురోట్లో వేసి నీరు తగలకుండ మెత్తగా రుబ్బుకోవాలి. బియ్యం మెత్తగా కాటుకలాగున ముద్దగా నూరుకొని తెల్లదుంపలముద్దలో వేసి కలిపి మిగిలిన కోవాముద్దవేసి ఒక స్టీలుపళ్ళెంలో తీసి వుంచుకోవాలి. మిగిలిన యాలకులపొడి కూడ కలుపుకొని కొంచెం చేతికి తడిచేసుకొని (ఎడమచేయి అరచేతిలో) నిమ్మకాయంత దుంపముద్దను తీసుకొని పూరీవలె చరచి అందులో కొబ్బరిలౌజును చిన్న వుండగా చేసివుంచి చుట్టూవున్న దుంపముద్దతో కప్పి, వుండగాచేయాలి. అంటే లోపల కొబ్బరిలౌజును పెట్టిన బూరెలాగున తయారవుతుందన్నమాట. ఇలాగ తయారుచేసిన వుండలను పొయ్యిమీద కళాయివేసి అందులో పావుశేరు నెయ్యిపోసి మరగిన తరువాత వుండలను ఒక్కొక్కటివేసి సన్నటి సెగతో వేపాలి. దోరగా వేగనిచ్చి ఒకపళ్ళెంలో వుంచుకోవాలి. పాంతువాలన్నీ వేగిన తరువాత అర్ధశేరు పంచదార లేతపాకంపట్టి చల్లారిన తరువాత పాంతువాలన్నీ పాకంలో వేసెయ్యాలి. ఇవి కనీసం నాలుగు గంటలైన వూరనివ్వాలి. ఇవి నాలుగు రోజులు నిలవ వుంటాయి.

—బి. అన్నపూర్ణ,
(వాల్తేరు)

* * *

## కజ్జికాయలు: కొన్నిరకాలు

పండుగకు చేసుకోవటానికి కజ్జికాయలు చేయడం యిక్కడ చెప్తున్నాను. కజ్జికాయలలోపల రకరకాల పూర్ణాలు పెట్టి మైదాపిండితో చేస్తారు.

### శనగపిండితో:

½ వీశె మైదాపిండి, ½ శేరు వేయించిన శనగపప్పు, పవాశేరు ఎండుకొబ్బరి చిప్పలు, పవాశేరు పంచదార, ఒక తులం ఏలక్కాయలు, నెయ్యి.

ముక్కవాసనలేని శుభ్రమైన మైదాపిండి జల్లించి వుంచుకోవాలి. కొంచెము నెయ్యి వేసి, పూరీలపిండికి వలె కొంచెము గట్టిగా, యీ పిండిని నీళ్ళతో కలిపిపెట్టుకోవాలి. శనగపప్పు, వేయించినది, రోట్లోవేసి బాగా మెత్తగా పొడుంకొట్టాలి. పంచదారకూడా రోట్లో వేసి మెత్తగా దంచి, ఎండుకొబ్బరి కోరంతో కొబ్బరి సన్నగా తురమాలి. ఒక కళాయిపళ్లెంలో గాని స్టెయిన్‌లెస్‌పళ్లెంలో గాని పైన దంపి వుంచుకున్న శనగపప్పు పొడుమూ, పంచదార, కొబ్బరికోరూ పోసి బాగా కలిపి, ఏలక్కాయలు గూడా పొడికొట్టివేసి, కజ్జికాయలకు లోపల పెట్టేపూర్ణం తయారు చేసుకోవాలి. మైదాపిండి పూరీలపేట మీద బాగా మర్దించి, చిన్న వుసిరికాయలంత వుండలు చేసుకోవాలి. చిన్న అప్పడాల సైజులో పూరీ వత్తుకుని, పైన తయారు చేసిన మిశ్రమం ఒక పెద్ద చెంచాడు దాని మీద మధ్యగా వేయాలి. పూరీని పూర్ణం, మీదుగా సగానికి మడిచి, రెండంచులూ కలిపి మెలికవచ్చేటట్లు నొక్కులు నొక్కులుగా చుట్టాలి. ఇప్పటికి కజ్జికాయ తయారవుతుంది. అన్ని పూరీలూ యీవిధంగా కజ్జికాయలు తయారుచేసుకొని, బాణలిలో నెయ్యిపోసి కాగనిచ్చి, ఈకజ్జికాయలన్నింటిని ఒక్కొక్కటే విడిగావేసి యెర్రగా వేయించి తీసుకోవాలి. వేయించేటప్పుడు పైపూరీ చిరిగిలోపలి పూర్ణం బయటికి రాకుండా చూసుకోవాలి. పంచదార మనకు కావలసిన తీపినిబట్టి వేసుకోవచ్చును.

### బొంబాయి రవ్వతో:

పవాశేరు బొంబాయిరవ్వ, పావుశేరు పంచదార, కొంచెము జీడిపప్పు, కిస్‌మిస్ పళ్లు, ఏలక్కాయలు, పావుశేరు మైదాపిండి, రెండు ఎండుకొబ్బరిచిప్పలు, నెయ్యి.

బాణలిలో కొద్దిగా నెయ్యివేసి జీడిపప్పు కిస్‌మిస్ పళ్ళూ, వేయించి తీసుకోవాలి. రవ్వ శుభ్రంగా బాగుచేసుకొని కొంచెము నెయ్యివేసి దోరగావేయించి తీసుకోవాలి. ఎండుకొబ్బరి తురుముకొని, వేయించిన రవ్వా, కొబ్బరకోరూ, మెత్తటి పంచదారా జీడిపప్పూ, కిస్‌మిస్ పళ్ళూ ఏలకుపొడీ వేసి బాగాకలిపి, కజ్జికాయల లోపలపెట్టే మిశ్రమం తయారుచేయాలి. మైదాపిండి పూరీలు వత్తి, పైవిధంగానే కజ్జికాయలు తయారు చేసి, నేతిలో వేయించాలి.

### నువ్వుపప్పుతో:

పావుశేరు నువ్వుపప్పు దోరగా వేయించుకుని. అర్ధసవాశేరు బెల్లం, ఒక ఎండుకొబ్బరి చిప్ప వేసిమెత్తగా చిమ్మిలితొక్కి మైదాపిండి పూరీల మధ్య పూర్ణంగా పెట్టి కజ్జికాయలు చేసుకొనవచ్చును. ఈ కజ్జికాయలు 5, 6, రోజులు నిలవవుంటాయి.

అన్నంరాజు రమణమ్మ
(గుంటూరు)



## నిమ్మకాయలు

(37 వ పేజీ తరువాయి)

గంట ఉంచి స్నానంచేస్తే సరి. 15, 20 రోజులలో గుణం కనిపించగలదు.

వర్షాకాలంలో ఎన్నోతీరుల పురుగులు వచ్చి దీపంచుట్టు తిరుగుతూంటాయి. అందులో కొన్ని కుట్టేవిగూడా ఉంటాయి. అటువంటి పురుగు ఏదేనా కుట్టిమంట పుడుతూ ఉంటే, దానిమీద నిమ్మరసం పోసి బాగారుద్దాలి. మంట పోతుంది. విషపు పురుగు అయినా విషం విరిచేస్తుంది.

అలసటగానో బద్ధకంగానో ఉంటే స్నానానికి ముందు ఉడుకు నీళ్ళలో రెండు మూడు నిమ్మకాయల రసం పిండి, నీళ్ళన్నీ కలిపి స్నానం చేస్తే బడలిక పోతుంది. బాగా ఆరోగ్యమునకు గూడా మంచిది. చర్మంమీద ఉండే క్రిమికీటకాలు పులుపువల్ల చనిపోతాయి.

కొందరికి మోచేతికి దెబ్బతగిలి గట్టిగా అవుతుంది. ఒక నిమ్మకాయకోసి, ఆడిప్పను, దెబ్బ గట్టిగా ఉన్న దగ్గర బాగా అదిమిపెటాలి. కొంచెం రసంతో మర్దనచెయ్యాలి. ఈ విధంగా కొన్ని రోజులు చేస్తే క్రమంగా నయమౌతుంది.







# "మిగతా ముక్కాణీ ఏంచేశావ్?"

★ కామేశ్వరి ★

'ఎప్పుడూ ఇంటిపట్టునవుంటే దానికి నీకెందుకు డబ్బు?' అని అడగనిభర్త, మాటి మాటికి అదే ప్రశ్నతో విసిగి వేసారి 'విషం తినడానికయినా కానీ వుండొద్దా' అని కసితీరా అడిగే భార్య, సామాన్య సంసారాల్లో కనబడుతూనే ఉంటారు.

స్త్రీకయినా, పురుషునికయినా ఆర్థికంగా, మానసికంగా, స్వాతంత్ర్యము వుండడం ఎంతైనా అవసరం. అందులోను భర్తమీద ఆధారపడి బ్రతక వలసిన భార్యకి, డబ్బు విషయంలో ఉండవలసినంత అయినా స్వాతంత్ర్యం లేకపోతే ఆ యిలు నరకంలా వుంటుందని వేరే చెప్పనక్కరలేదు. తలలో పెట్టుకునే అణా పూలకోసం, తినాలని వున్న తినుబండారాలకోసం కంటికి నచ్చిన నగలు, బట్టలు కొనుక్కోవడంకోసం, వీటన్నిటికి భర్తని యాచించడం, ఆత్మాభిమానంగల ఏ స్త్రీకయినా కష్టంగానే వుంటుంది. భర్త యింట్లోవున్న వేళ, లేనివేళ, యిల్లాలికి డబ్బు అవసరం వుంటూనే వుంటుంది.

భార్య అవసరాలు గుర్తించి, ఆమెకోసం రాబడిలో కొంత కేటాయించే భర్త నిజంగా పూజనీయుడు, అభినందనీయుడు. అటువంటివారి సంసారం ప్రశాంతంగా ఉంటుంది. చీటికీ, మాటికీ, చిల్లరకోసం దేబిరించడం స్త్రీకి కష్టమే. అస్తమానూ అడుగుతూందని భర్తకీ కోపమే. ఈ కోపతాపాలకీ, కసనిష్ఠూరాలకీ తావులేకుండా ఆర్థిక స్వాతంత్ర్యం యిద్దరికీవుంటే, సంసారంలో ఒడుదుడుకులు వుండవు.

'మాకు తెలిసిన కుటుంబం మా ప్రక్కవాటాలోనే వుండేవారు. ఆయన కంపెనీలో నెలకి వెయ్యిరూపాయలపైనా సంపాదించేవారు. రెండు చేతులా, యిష్టం వచ్చినట్లు ఖర్చుపెట్టేవారు. ఇంట్లో భార్యకి మాత్రం ఇవ్వరు. ఆవిడ మహా ఓర్పుగలది కాబట్టి, ఆయన కొన్న వాటితోనే తృప్తి పడేది. మనస్సులో ఏదో నిరాశ పేరుకుపోయి వుండేది. మా యింట్లో పూలుకొనుక్కుంటే, ఆ మాత్రం స్వాతంత్ర్యంలేని ఆ పునిస్త్రీకి మేమే యిచ్చేవాళ్ళం.

ఇలాగ చిన్న చిన్న ఖర్చుల విషయంలో భార్యని హింస పెట్టే వాళ్ళు, తామేదో ఘనకార్యం చేస్తున్నాం భార్యని చెప్పుచేతల్లో పెట్టుకుంటూన్నాం అనుకుంటారు. అది కేవలం వారి భావన మాత్రమే. అలా చేయగా, కొన్నాళ్ళకి భార్యకి భర్తమీద నిరసనభావం కలగడం, కులాసాగా వుండలేకపోవడం జరగవచ్చు. ఇలా స్వాతంత్ర్యం లేక, ప్రతి కానీకి పద్దు అడిగే భర్తలు వున్నారు.

'నిన్న బేడ యిచ్చానుకదా! అణావంకాయలు, కానీ పచ్చిమిరపకాయలు కొన్నావు. మిగిలిన మూడు కానులు ఏంచేశావ్!' భర్త అడుగుతాడు. నిజమే మరి. జిహ్వాచాపల్యం చంపుకోలేక, ప్రక్కింటి అబ్బాయిని బ్రతిమాలి, కానీ లంచమిచ్చి, అర్థణా పకోడీలు తెప్పించుకుంది ఆ యిల్లాలు. దానికే యిన్ని ఆరాలు తీసి నేరాలు చేసినట్లు దండించటం.



'గేవాకలర్' ఛాయాగ్రహణంలో ప్రత్యేక శిక్షణ పొందడానికై గతమాసం బ్రసెల్స్ (బెల్జియం) వెళ్ళిన ప్రథమ ఆంధ్రమహిళ శ్రీమతి సరస్ కె. కోటే. వర్ణ ఛాయాగ్రహణంలో శిక్షణకై విదేశాలకు వెళ్ళిన తొలి భారతీయ మహిళ కూడా ఈమే. బరోడా, అహమ్మదాబాద్‌లలో ఫొటోగ్రాఫర్‌గా మంచి పేరు గడించారు. శిక్షణ పూర్తిఅయిన తరువాత లండన్, పారిస్, బాన్ (పశ్చిమజర్మనీ), స్విట్జర్లాండ్, ఇటలీలు వెళ్ళి తిరిగివస్తారు.

ఆర్థికస్వాతంత్ర్యం లేని భార్యలు, యింట్లో పప్పూ, ఉప్పూ అమ్మి వాళ్ళ అవసరాలు తీర్చుకోవడం అరుదుకాదు. ఇలాంటివాళ్ళు చాలామందిని నేను ఎరుగుదును. నెలమొదటి తేదీని, నెలసరి దినుసులు తెచ్చి పడేసిన సంసారాల్లో, నెలరోజులు సరిపోవలసిన దినుసులు పదిరోజులకే మాయమై, యిల్లాలు అప్పులకోసం యింటింటికి బయలుదేరడంలో అంతరార్థం! తామేదో ఘనకార్యం చేస్తూన్నామనుకుంటారేగాని చాటుగా భార్యలు చేసే 'బ్లాక్ మార్కెటు' గుర్తించలేరు. ఎంత సి. ఐ. డి. యిన్స్పెక్టరయినా ఇంటిదొంగని ఈశ్వరుడైనా పట్టలేడన్న సామెత అబద్ధంకాదు. ఇది మధ్యతరగతి కుటుంబాలలో సామాన్యంగా జరిగే విషయం.

ఇకపోతే, ఆర్థికంగా గొప్పవైన కుటుంబాల సంగతి, వారిలోకూడ ఈ సమస్య వుండనే వుంటుంది. ఆర్థికంగా స్వాతంత్ర్యం లేకపోయినా, భర్త పలుకుబడీ, పేరూ వుపయోగించి నాలుగుచోట్ల అరువు బేరాలతో తమకుకావలసిన సరుకులు తెచ్చుకునే స్త్రీలు వున్నారు. మొగవారి పేరు ప్రతిష్ఠలకి భంగం వస్తుందన్న సంకోచం కూడ వీరికి కలగదు. ఉద్యోగస్థుల భార్యలలో, భర్త యాచించకపోయినా, చాటుగా తాము లంచాలు తీసికొని భర్తలకు సిఫారసు చేసిన వాళ్ళని చాలామందిని చూశాను. కోడిగ్రుడ్డు మొదలుకొని కొల్లేగాల్ చీరవరకూ లంచాల పద్ధతిమీద సంపాదన చేసినవాళ్ళని ఎరుగుదును. ఇటువంటి పనులుకూడ స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవడం మూలంగానే, జరుగుతున్నాయి.

స్త్రీలకి ఆర్థికస్వాతంత్ర్యం లేకపోవడంతో రకరకాల ఆలోచనలు, అనుమానాలు బయలుదేరతాయి. నా ఫ్రెండుకి యీ మధ్యనే పెళ్ళయింది. అంతకుముందు ఎంతో వుత్సాహంగా, వుండే మనిషి కాస్తా ఎందుకొచ్చిన జీవితంరా అని యీసురోమనే స్థితికి వచ్చింది. నాకే ఆశ్చర్యమేసింది. నేను లాలించి మంద






## ధర్మ సందేహం

ముందరపు పద్మ, లలితగార్లు 2-10-57 పత్రికలో రచించిన వ్యాసం (వంకాయ) చదివాక నాకు ఈ అభిప్రాయాలు కలిగి నాయి. వనితల కేవిధంగా ఆ వ్యాసం ఉప యోగపడుతుంది? అందులోనూ, ఈ పద్యాన్ని అనేకులు అనేక సందర్భాలలో ఉపయో గించి చాలా పాతపర్చివేశారు. అందులో ఉదహరించిన కథకూడా కొత్తదేమీ కాదు. వనితాలోకం పేరును సార్థకపరచే రచనలను పంపాలిగాని ఉట్టి ఊకదంపుడు దంపవద్దని నా అభిప్రాయం. "ప్రక్కింటివారి పుస్తక పఠనం" లాంటివి యింకా సోదరీమణులు పంపాలి.

గాడేపల్లి లలిత, వాల్తేరు.

* * *

---

## "మిగతా ముక్కాలో ఏంచేశావ్?"

తించి, కారణం అడిగాను. చెప్పలేక చెప్పింది. భర్త కొంటానన్నవాచీ, ఎంతకీ కొనకపోతే తండ్రి కొన్నాడుట. అదీబాధ, ఎంతయినా ఖర్చుపెడుతూ వుంటారు, యింట్లో ఆడవారి సరదాలు తీర్చలేనివాళ్ళు వుంటారు. అది ఆడవాళ్ళ దురదృష్టమే అయివుంటుంది.

భార్య భర్త లిద్దరూ సంపాదనపరులైతే, యిన్ని యిబ్బందులు వుండవనుకుంటాను. ఎవరి యిష్టము వచ్చినట్లు వారు ఖర్చుచేసినా యిద్దరూ సంసారానికే చేస్తున్నాంకదా అని తృప్తివుంటుంది.

ఏది ఎలావున్నా, సంసారాల్లో భార్యా భర్త లిద్దఱికీ సమాన స్వాతంత్ర్యం వుంటేనే ఆనందం.



## దశావతారాలు!

చీర చిరిగినవెంటనే ఎవరూ ఒకపట్టాన దానికి మరోఅవతారం కల్పించరు. చీరమీద నుండే మమకారమో మరోకారణమో అది బాగా పాతదయేవరకు వెన్ననివ్వరు. అప్పుడు దానికి దశావతారాలు మొదలు పెడితే దానికై వినియోగించినదారం వృథా కదా.

పాతబట్టతో మరోపాత స్వరూపాన్నే తయారుచెయ్యడంకంటె కొత్త వస్తువునే కొనుక్కుంటె చూడడానికి, వాడుకను మన్నికకుకూడ చాలా బాగుంటుంది. నేను ఏడున్నరచేసే పాతచీరలిచ్చి, నాలుగున్నర చేసే గిన్నె కొన్నాను. నాలుగేళ్ళయినా అది బాగానే పనికొస్తోంది.

—వి. కనకం [కాకినాడ)

* * *

"అమ్మబోతే.అడివి. కొనబోతే కొరివి" అన్న వ్యాసము చదివితిని. మనమూ వ్యాసం వ్రాద్దామని వ్రాసినట్లు కనబడుతోంది, తప్ప సబబుగాలేదు.

వీధిలోకి వచ్చినపేపర్లుకొనేవాడు 4 వీశల పేపర్లని వీశన్నరక్రిందతూచాడట. ఇది చాల అసందర్భం. ఏదేనా వ్రాస్తే నమ్మేలా వుండాలి. ఇంకా మొగవాళ్ళైనా ఓకాగితం ఎక్కువవేస్తే తెలిసో, తెలీకో వూరు కొంటారుగాని ఆడవాళ్లు అస్సలువూరుకోరు. ఎంత తెలీనివాళ్ళయినా కాగితాల్ని చూసి సరాసరి ఎన్నివీశలున్నాయో చెప్పగలం.

—దాతారి హనుమంతరావు,
రాజమండ్రి.

* * *

"అమ్మబోతే అడివి - కొనబోతే కొరివి" అను వ్యాసము చక్కగానున్నది. వారికి నా ధన్యవాదములు.

సంధ్య, బందరు.

## పురుషులు పుస్తకాలు చదవరు!!

శ్రీ బి. నారాయణరావుగారు 2-10-57 పత్రికలో గ్రంథాలయాలనుగురించి వ్రాసినది చదివాను. 'సాధారణంగా ప్రతివారు ముఖ్యం గా స్త్రీలు నవలలే చదువుతారు' అని వారు వ్రాశారు. గొల్లపూడిలో స్త్రీలు ఎక్కువగా నవలలు తెప్పించుకోవడంవల్ల అనుభవాన్ని బట్టి వారు అలా వ్రాసివుండవచ్చు. కాని అన్ని వూళ్లలో స్త్రీలు నవలలొక్కటే చదువుతారా? ఎవరి అభిరుచినిబట్టి వారి కిష్టమొచ్చిన పుస్తకాలు వారు చదువుతారు. స్త్రీలకుమాత్రం క్రొత్తవిషయాలు చదువు కోవాలని వుండదా?

'ప్రతి గ్రంథాలయంలోనూ నవలలన్నీ వుండవుకదా!' అని వ్రాశారు. నిజమే! కాని నవలలు వుండీకూడ సోమరితనంవల్ల వెదకి యివ్వలేనివారిని ఏం అనాలి? ఊహించి కాదుగాని, అనుభవ పూర్వ కంగా నేనొకటి చెబుతాను, వినండి. పుస్తకాలలిస్టు (10 పుస్తకాలు) తీసుకొని వెళ్లి మా జవాను లైబ్రేరియన్ చేతికిస్తే, ఆయన ఆ లిస్టును చూడకుండా నిర్లక్ష్యంగా చేతికందిన పుస్తకాలు యిచ్చారట. దీనికే మనాలి? అందుకే స్త్రీలకు ప్రత్యేకం గ్రంథాలయాలు వుంటే యిలాంటి ఫిర్యా దులు వుండవుగా మరి!

'వున్న గ్రంథాలయములే నడువలేని ఈ కాలంలో......' అని వ్రాశారు. నడవలేక పోవటానికి కారణం సరిగా తెలుసుకోవాలి. బి. ఎస్. లక్ష్మిగారు (కాకినాడ) వ్రాసి నట్టు పుస్తకాలు సరిగా అందనిపక్షంలో ఎవరు చందా కడతారు? ఒక్కొక్కసారి విసుగెత్తి నేనుకూడ మా వారితో 'చందా కట్టడం దండుగ' అని అంటుంటాను. ఆయ నేమో 'పోనిద్దూ ఒక్క రూపాయేగా!' అని చప్పగా అనేస్తారు. కొందరికి రూపా యకు విలువ లేకపోవచ్చు. కాని మరికొందరు ఆ రూపాయకు ఎంత విలువనిస్తారో ఆలో చించరు.ముఖ్యంగా పురుషులకన్నా స్త్రీలకే పుస్తకాల అవసరం ఎక్కువగా వుంటుంది. ఎక్కువమంది పురుషులకు వుద్యోగంచేసి యింటికొచ్చి పేపరు చదవటానికకూడ తీరిక వుండదు, ఇక లైబ్రరీపుస్తకాలు ఏమి చదువుతారు? పనిలేనివారు, తీరిక వున్న వారు ఏ కొద్దిమందో (పురుషులు) చదువు తారుకాని చాలామంది యింట్లో ఆడవారి కోసం పుస్తకాలు తీసుకెళ్తారు. స్త్రీలు ఎంతపనిచేసి విసిగివున్నా పుస్తకాలు చదవా లంటే ఆ విసుగు యిట్టే మాయమైపోతుంది.

మంగళాకందూర్ (విశాఖపట్నం.)






# ★ బాలుడూ — చిలుకా ★

చిలుక :

ఏల యేడ్తువు బాల!
ఈలవేయుట మాని.
చెల్లునే నీ కిపుడు
వల్లమాలిన చింత?

బాలుడు :

ఏమి చెప్పుదునమ్మ?
రామచిలుకా నేను.
అమ్మ వద్దనె ఆట
నామాట వినదయ్యో!

చిలుక :

ఆట మానిన నేమి
పాటపాడెద నేను.
హాయిగా వినుమయ్య
బాబు! ఏడుపుమాని.

బాలుడు :

నా చింత నీకేటులు
రా చిలుక తెలియు!
స్వేచ్ఛ లేకయు నేను
కూర్చొందు నాయింట?

చిలుక :

నీకె కావలయునా
నాకు వలదా స్వేచ్ఛ?
నాకు బంధన యున్న
ఒకరైన విడిచార?

బాలుడు :

తెలిసెను నీబాధ
తరలిపో స్వేచ్ఛగా
నీలాలమేఘాల
చెలువ మాస్వాదించి.



బాలుడూ ముదముతో
చిలుక నొదిలేను
రా చిలుక మింటికి
స్వేచ్ఛగా యెగిరేను.

కొడవంటి లీలామోహనరావు

# మూడు వరాలు

సి. డి. ఎస్. రామయ్య

నీలగిరి తేయాకుతోటల్లో రంగయ్య అనే అతడు కూలీపనిచేస్తూ జీవించేవాడు. తోట చివర ఒకవైపున ఒక గుడిసెలో—అతనూ—అతని భార్య కమలమ్మా, వాళ్ల ఒక్కగా నొక్క కొడుకు బాబు—కలిసి నివసిస్తూ వుండేవారు.

బాబు ప్రక్క పట్టణంలో వున్న స్కూల్లో రెండోఫారం చదువుతూండేవాడు. తెలివితేటలు గలవాడు కాబట్టీ, చురుకైనవాడు కాబట్టీ—తరగతిలో ఫస్టుమార్కులు తీయసాగాడు. బాబు అంటే—మిగతా విద్యార్థులకి ప్రత్యేకమైన అభిమానమూ, గౌరవమూ వుండేవి.

బాబు రోజూ మూడుమైళ్లు నడిచి స్కూలుకి వెళ్లేవాడు; మళ్లీ సాయంకాలంపూట తిరిగివచ్చేవాడు. వాడితోబాటు ఇంకా కొంతమందిపిల్లలు తోటల ప్రాంతాలనుండి వచ్చి చదువుకోడంవల్ల, వాడికి స్కూలుకు వెళ్లిరావడం శ్రమ అనిపించలేదు.

బాబుకి ఒంటరితనమంటే ఎంతో ఇష్టం. ఒక్కొక్కప్పుడు స్కూలుకి వెళ్లిరావడంలోగూడా ఒంటరిగానే ప్రయాణమయేవాడు. ఆ ఒంటరితనంవల్ల, వాడికేవో చిన్నచిన్న ఆలోచనలూ, అందువల్ల ఏదో తెలియరాని ఆనందమూ కలిగేవి. చదువుకోడంలోగూడా అంతే! రాత్రిపూటయితే, ఇంట్లో కూర్చుని చదువుకొనేవాడు గాని, పగటిపూటయితే—ఏ గుట్టమీదో, ఏ చెట్టుమీదో కూర్చుని, హాయిగా—ఒంటరిగా ఎంతసేపయినా చదువుకొనేవాడు. అది వాడికి అలవాటైపోయింది. ఈ ఒంటరితనపు అలవాటును పోగొట్టాలని వాడి తలిదండ్రులు ప్రయత్నించేవారేగాని తీరా అందువల్ల వాడి చదువు పాడయిపోతుందేమోనని వాళ్లూరుకున్నారు.

చీకటిపడేంతవరకూ-బాబు అలా గుట్టమీదో చెట్టుమీదో తిరగడంవల్ల—వాడి కేదేనా అపాయం కలుగుతుందేమోనని వాళ్లమ్మ కంగారుపడేది. అందువల్ల—ఒక్కొక్కప్పుడు మాత్రం బాబుని తేలికగా మందలించి వూరుకునేది...

ఇలా వుండగా — ఒకసారి సంక్రాంతి పండుగ వస్తున్న దగ్గిరి రోజుల్లో—ఒకరోజు—

చదువుకోడానికి వెళ్లిన బాబు—ఆరాత్రి చాలా వేళయినతర్వాత ఇంటికి వచ్చాడు. అంతవరకూ వాడు కనిపించకపోవడంవల్ల—వాడికోసం బెంగపడి — వీధిగడపలోనే కాసుక్కూచున్న కమలమ్మ వాడిని చూసి చెప్పలేనిఆనందం అనుభవించింది. వాడిని ప్రేమతో దగ్గరికి తీసుకుంది. తర్వాత— "ఇంతసేపటివరకూ యేం చేశావ్



ఢాం! ఢాం! ఢాం!

ఫొటో: వి. కేశవశర్మ.



చిచ్చుబుడ్డి
ఫోటో: ఎస్. గిరిధర్.

నాయనా!—త్వరగా వచ్చేయక పోయావ్?"—అని అడిగింది.

తల్లి అడిగిన ప్రశ్నకు సూటిగా జవాబు చెప్పలేకపోయాడు బాబు. వాడి ముఖకవళికలలో ఏదో అర్థం చేసుకోలేని అమాయకత ప్రతిఫలించింది. అవన్నీ పైకికనిపించకుండా అప్పటికి తోచిన జవాబేదో చెప్పి, వూరకుండిపోయాడు బాబు. కమలమ్మ కూడా వాడిని మళ్ళీ మళ్ళీ అడగడాని కిష్టపడక వూరకుండిపోయింది.

ఆ రాత్రి చాలా సేపటివరకూ బాబుకు నిద్రరాలేదు. తెల్లవారింది. తేయాకుతోటల సైరన్ బిగ్గరగా వినిపించింది. బాబుతండ్రి రంగయ్య కాలకృత్యాలు ముగించుకుని నౌఖరీకి బయలుదేరాడు.

పదిగంటల వేళయింది.

ఎస్టేటుదొర భవనం ముందు అందరూ హాజరుకావాలని—కూలీలందరికీ పిలుపువచ్చింది. అందరూ అక్కడికి వెళ్ళారు.

ఎస్టేటు దొర అందరినీ ఉద్దేశించి "సంక్రాంతి పండుగ ఇంకా అయిదు రోజు లున్నదని, మీకు పండుగ బోనసు ఇవ్వాలనే అభిలాషతో—5000 రూపాయలు ఆఫీసులో తెచ్చి ఉంచాను. కాని, ఇప్పుడు దాన్ని చూడబోయేసరికి కనిపించడంలేదు. దాన్నెవరో దొంగిలించివుంటారనుకుంటాను. అది తిరిగి నాచేతికి వస్తేగాని, మీకు బోనసు లభ్యంకాదని చెప్పటకు విచారిస్తున్నాను" అన్నాడు.

కూలీలమధ్య గుసగుసలు బయలుదేరాయి. తమ బోనసు డబ్బును దొంగిలించిన వ్యక్తిని నోటికివచ్చినట్టు తిట్టసాగారు. ఆ బోనసుడబ్బు యెలాగైనా దొరకాలని కొందరు దేవుణ్ని ప్రార్థించారు.

అంతలో ఎస్టేట్ దొర మళ్ళీ ఇలా అన్నాడు: "మీ బోనసు డబ్బును దొంగిలించినవారిని పట్టుకోడానికి నాశాయశక్తులా ప్రయత్నిస్తాను. నాలాగే మీరూ మీమీ శక్తివంచన లేకుండా ప్రయత్నించండి. ఇంకోవిషయం: ఆ దొంగిలించిన వ్యక్తిని పట్టి యిచ్చినవారికి 500 రూపాయలు గూడా బహుమానం ఇవ్వగలమని హామీ ఇస్తున్నాము..." అని చెప్పి ఆయన వెళ్ళిపోయాడు.

అంతవరకూ సంక్రాంతి బోనసు రాగలదని ఆశతోవున్న కూలీల ముఖాలు విచారపూరితాలయాయి.

అందరూ నిస్పృహతో పనులు చేయడానికి వెళ్ళారు.

మర్రోజు ఆదివారం...అది సెలవురోజయినా—'సైరన్' కూత వినబడేసరికి అక్కడి కూలీలంతా ఆశ్చర్యపోయారు. ఏమిటా వింత అని అందరూ తమ కార్యాలయం దగ్గరికి వెళ్ళారు. అక్కడ ఎస్టేట్ దొర, ఆయనతోబాటుఒకకుర్రాడు—బాబూ—నిలబడివున్నాడు. కూలీల కేమీ అర్థంకాక నిలబడ్డారు.

అందరినీ వుద్దేశించి ఎస్టేట్ దొర ఇలా చెప్పాడు: "నిన్నటి రోజు



కాంతిచక్రం!
ఫోటో: ఎస్. గిరిధర్.

#  మూడు వరాలు 

దొంగిలించబడిన మీ బోనసుడబ్బు మళ్ళీ లభించింది. ఆ పుణ్యకార్యం చేసినవాడు యీ అబ్బాయి...నా తరఫునా, మీ అందరితరఫునా—ఈ అబ్బాయికి కృతజ్ఞత తెలుపుకుంటున్నాను. తర్వాత నేను ఇచ్చిన మాటప్రకారం — ఆ దొంగిలింపబడిన డబ్బును తిరిగి మనకు ఇప్పించినందుకుగాను — బహుమానంగా— ఈ అబ్బాయికి ఈ 500 రూపాయలు ఇస్తున్నాను—" అంటూ బాబుకి డబ్బుమొత్తాన్ని అందించాడు...

కూలీ లందరూ ఆనందంతో చప్పట్లు కొట్టారు. తమ డబ్బును తమకు మళ్లీ ఇప్పించినందుకు బాబుని నానావిధాలుగా పొగిడారు.

డబ్బు తీసుకుని—బాబు యిల్లు తిరిగాడు. ఆ డబ్బును తల్లి చేతికిచ్చాడు. అంతలోనే కమలమ్మకు ఈ విషయం తెలిసిపోవడంవల్ల—ఆనందంతో బాబుని కౌగిలించుకుంది. తర్వాత-అతన్ని అడిగింది:

"దొంగిలించబడిన డబ్బును తిరిగీ నెలా సాంధించగలిగావ్ నాయనా?"

బాబు చెప్పసాగాడు:

"మొన్నటిరోజు సాయంకాలం ఆ మూలనున్న చెట్టుమీదకూర్చుని నా పాఠాలు చదువుకుంటూ వున్నాను. బాగా చీకటిపడింది. చెట్టు దిగబోయాను. అంతలో నేనున్నవైపుగా ఎవరో పరుగెత్తి వస్తున్న చప్పుడైంది. దిగుతున్న వాడినల్లా, ఆగి చూశాను: ఎవరో ఒకవ్యక్తి పరుగెత్తుకుంటూ వస్తున్నాడు. అతనిచేతిలో ఏదోమూట లాంటిది వుంది. చీకటిపడ్డంవల్ల అతని రూపమేదీ సరిగా కనిపించలేదు. అతనలా పరుగెత్తుకుంటూ కొంతదూరంవెళ్లి, గుర్తించినట్లున్న ఓ తేయాకు చెట్టుదగ్గర పల్లంతవ్వి, మూటలాంటిదాన్ని పాతిపెట్టాడు. పిదప—లేచి—అటూ ఇటూ ఒకసారి కలయచూసి—మరీ వెళ్ళసాగాడు...నాకేదో అనుమానం వేసింది. నేనుచెట్టుదిగి, అతనివెంటే నడవసాగాను. అతనలా నడిచివెళ్లి ఒక గుడిసెలో దూరాడు. ఆ ఇంట్లోని దీపపువెలుగులో అతని ముఖం నాకు బాగాకనిపించింది. ఆ ముఖాన్ని చూడటంతోటే—నా అనుమానం బలపడింది. ఉన్నపళంగా వెళ్లి—ఆ పాతిపెట్టినదేదో తీసి చూశాను. అది దొరగారివద్ద వున్న తోలుసంచీ. దానిలో డబ్బునోట్లున్నాయి...నా కేమీ తోచక మళ్ళీ దాన్ని యథాస్థానంలోనే

పాతిపెట్టి, తిరిగి ఇంటికి వచ్చేశాను. అందువల్లే, మొన్నటిరోజు ఇంటికి రావడానికి కొంత ఆలస్యమయింది.

"నిన్న ఉదయం దొరగారి ఆఫీసు నుండి డబ్బు దొంగిలింపబడిందని వినబడేసరికి, నాగుండె జల్లుమంది. ఆ పాతిపెట్టినడబ్బు—ఆ డబ్బేమోనని అనుమానపడి, దాన్ని అక్కడి నుండి తీసుకొచ్చేశాను. మీదగ్గర ఈ విషయం చెబితే, ఇంకా యెంత గల్లంతు అవుతుందోనని భయపడి పూరకుండిపోయాను. సాయంకాలం వరకూ ఆలోచించి, తర్వాత ఆ తోలుసంచీని తీసుకుని - దొరగారి దగ్గరకు వెళ్ళాను. ఆయన నన్ను చూసి ఏమిటని అడిగాడు. నే తీసుకొచ్చినసంచీని ఆయన చేతికిచ్చాను. ఆయన సంతోషించాడు.

'ఈ డబ్బు దొంగిలించిన వారెవరు?' అని అడిగాడు.

'మీరు నాకు మూడువరాలివ్వగలిగితే, దొంగిలించినవారెవరో చెప్పగల'నని అన్నాను.

ఆయన 'సరే' నన్నాడు.

ప్రమాణం చెయ్యమన్నాను. ఆయన ప్రమాణం చేశాడు. 'నువ్వు కోరే వరాలేమిటో చెప్ప' మన్నాడు.

నేను చెప్పాను: '(1) దొంగిలించినవారిని పట్టి యిచ్చినవారికి, 500 రూపాయలు ఇవ్వగలట్టు మీరు ప్రకటన చేశారు. అయితే నాకాబహుమానంవద్దు. (2) దొంగిలించిన మనిషి—మీకూ, నాకూ తప్ప మరొకరికీ తెలియకూడదు. (3) ఆ దొంగిలించిన మనిషిని—ఏకారణంచేతనైనా పనినుండి తొలగించకూడదు ... ఇవే నా మూడు వరాలు...' అన్నాను.

'సరే, నువ్వుకోరిన వరాలు ఇస్తున్నాను'అని ఆయన ప్రమాణం చేశాడు. నేను దొంగిలించిన మనిషెవరో ఆయనకి చెప్పాను. ఆయన ఆశ్చర్యపోయాడు; నవ్వాడు; సంతోషించాడు. ఆఖరికి ఆయన అన్నాడు: 'బాబూ! స్వార్థంలేని నీ ఉదారస్వభావానికి నేను చాలా సంతోషిస్తున్నాను. అందుకుగాను నువ్వు కోరకపోయినా — నే నివ్వదలచిన బహుమానాన్ని నీకు తప్పక ఇచ్చితీరాలని నిశ్చయించాను. నువ్వు తీసుకు తీరాలి' అన్నాడు. ఎంతచెప్పినా ఆయన వినిపించుకోలేదు. ఆఖరికి అందరి సమక్షంలో నాకా అయిదు వందలూ ఇచ్చాడు" అనిచెప్పి ముగించాడు బాబు.

కమలమ్మ అంతా విని నిట్టూర్చింది. తర్వాత అంది:

"ఇంతకీ ఆ దొంగిలించిన మనిషెవరో చెప్పావుగాదు?" తల్లి ప్రశ్న వినేసరికి బాబు ముఖం విచారంతో పాలిపోయింది: "చెప్పాలా అమ్మా?" అని అడిగాడు.

"ఫరవాలేదు; చెప్పు నాయనా?" అంది కమలమ్మ.

తల్లిచెవిదగ్గరచేరి, బాబు ఏదో గుసగుస లాడాడు. వాడిమాటలు వినేసరికి కమలమ్మ ఆశ్చర్యంతో కంపించిపోయింది. తన మెడలోని మంగళసూత్రాన్ని ఒక్కసారి తీసి కళ్ళకద్దుకుంది: 'బతికించావు భగవంతుడా' అని గొణుక్కుంది.

తర్వాత, బాబును కౌగలించుకుని—"మన గౌరవం నిలబెట్టావు నాన్నా!" అంటూ ఆనందంతో పరవశురాలయింది. ★

# సినిమా

## బొంబాయి లేఖ

బొంబాయి చిత్రసీమలో చిన్నసైజు స్వర్గసీమ, అనతగ్గ మూడిటిలో రెండవది బీనారాయ్, ప్రేమనాథ్‌ల వివాహం. బీనారాయ్ అసలుపేరు కృష్ణా సరీన్. ఐదేళ్ళ క్రితం కృష్ణ లక్నోలోని ఇసబెలా కాలేజీలో ఇంటర్ మీడియెట్ పుస్తకాలు తిరగేస్తూ, సినిమాపత్రికలు చదువుతూ ఉండేది. ప్రేమనాథ్ అప్పుడు పెద్దనటుల జాబితాలో ఉన్నాడు.

దర్శక నిర్మాత కిషోర్ సాహూ చిత్రం 'కాలీఘటా'లో కొత్త యువతులు కావాలని పత్రికలలో ఒక ప్రకటన పడింది. వందల్ల దరఖాస్తులు వచ్చాయి. వాటిలో బీనారాయ్‌ది కూడా ఉంది. కిషోర్ సాహూ ఆమెను ఎన్నిక చేశాడు.

తరవాత కొన్నాళ్ళకు 'ఔరత్' ('శాంసన్ అండ్ డిలైలా' చిత్రానికి హిందీ తర్జుమా) చిత్రంలో బీనారాయ్ బుక్ అయింది. అందులో నాయకుడు, కాబోయేభర్త ప్రేమనాథ్. ఆ చిత్రానికి ఔట్‌డోర్ దృశ్యాలు చిత్రించడానికి 'ఔరత్' నిర్మాణబృందం మైసూరులోని బృందావన గార్డెన్స్‌కు తరలి వెళ్ళారు. అప్పటికే కృష్ణఉరఫ్, బీనా, ప్రేమనాథ్ ప్రేమించుకొన్నారు. మనోహరమైన బృందావనోద్యాన వనాలలో కృష్ణప్రేమ పెంపొందింది. 'ఔరత్' చిత్రం విడుదల అయేనాటికి వాళ్ళిద్దరూ పెళ్ళిచేసుకున్నారు. ఏడాది తరవాత కొడుకును కన్నారు. అతనిని ప్రేమనాథ్ జూనియర్ అన్నారు.

మౌంట్ ప్లెజంట్ రోడ్‌లోని 'దర్శన భవనా'లో ప్రేమ్‌నాథ్ చక్కటి ఇల్లు సంపాదించాడు. బొంబాయిలో డబ్బుగలవాళ్లు అంతా ఆ వాడలో చోటుకోసం ప్రయత్నిస్తారు. అక్కడి ఇళ్లు మనోహరంగా ఉంటాయి. వాటిలో ఆధునికం అనతగ్గ వసతులు అన్నీ — వాకిట్లో పూలతోట, పెరట్లో నీటికొలను (స్విమింగ్ పూల్), ఓ పక్కన ఆటస్థలం మొదలైనవి ఉంటాయి. ప్రేమనాథ్ దంపతులు, కులదీపకుడూ కాక, ఆ యింట్లో, ప్రేమనాథ్ అన్నదమ్ములు ముగ్గురు, అతని స్వస్థలం జబల్‌పూర్ నుండి వస్తూ పోతూ వుండే చుట్టపక్కాలూ కొందరూ ఉంటూ ఉంటారు. ఇల్లు ఎప్పుడూ సందడిగా, సంతోషంగా ఉంటుంది.

బీనారాయ్ ఇపుడు అరడజను చిత్రాలలో నటిస్తోంది. ఒక పద్ధతిలో కార్యక్రమం నిర్ణయించుకుని రోజూ కొంతసేపు ఇంట్లో ఉండి పనులు చక్కబెట్టుకునే గృహిణి బీనారాయ్.

ప్రేమనాథ్ ప్రస్తుతం చిత్రనిర్మాణం

(52 వ పేజీ చూడండి)



ఉషాకిరణ్

### సీ...సీ...మః లేక కొండగుర్తు!

ప్రధాని నెహ్రూ మొన్న టోక్యో వెళ్లినపుడు జాపనీస్ ఫిలిం ప్రతినిధులతో మాట్లాడుతూ, 'మా దేశంలో మంచి చిత్రాలు డబ్బుచేసుకోవు. బాక్సాఫీస్ హిట్‌లు కావటంలేదు.' అన్నారు.

జపాన్‌లో కూడా పరిస్థితి ఇలాగే ఉందని అక్కడివారు బదులుచెప్పారు.

"చలనచిత్ర విమర్శకులు, ఫలానా చిత్రం చాలా బాగుందని మెచ్చుకున్నారంటే చాలు, దీనికి డబ్బులు గిట్టవు కాబోలని నిర్మాత భయపడుతున్నాడు." అని ఒకరు ప్రధానికి చెప్పారు.

# 'పరదేశి'

భారత రష్యన్ కళాకారులు భారీఎత్తున తలపెట్టిన 'పరదేశి' చిత్రనిర్మాణం పూర్తిఅయింది. ఈచిత్రానికి రష్యాలో జరిగిన షూటింగ్‌లో పాల్గొనడానికై వెళ్ళిన భారతీయ నటవర్గం నర్గిస్, పద్మిని, రాగిణి, అచలాసచ్‌దేవ్, బల్‌రాజ్ సాహ్ని, పృథ్వీరాజ్, జైరాజ్, డేవిడ్ ప్రభృతులంతా తిరిగి వచ్చారు. వచ్చిన వాళ్లంతా విడివిడిగాను సమష్టిగాను ఈ చిత్రంగురించి ఎంతోగొప్పగా చెప్పి మెచ్చుకుంటున్నారు. ఒక్కొక్కరు తమ తమ అభిరుచులనుబట్టి తమకు నచ్చిన విషయాలనుగురించి ఉత్సాహంగా వర్ణిస్తున్నారు. 'మేకింగ్' అద్భుతంగా ఉందని ఒకరంటే, సెట్స్ బ్రహ్మాండంగా ఉన్నాయి అని మరొకరు. నిర్మాణబృందంలో అందరూ ఎంత ఉత్సాహంతో, పరస్పర సహకార భావంతో పనిచేశారో ఇంకొకరు వివరిస్తున్నారు.

రష్యాపర్యటనకు వచ్చిన ఎలినార్ రూజ్‌వెల్ట్, మాస్కోలో భారతరాయబారి కె.పి.ఎస్. మీనన్‌లు ఈచిత్రం 'రషెస్' చూచారట.

'పరదేశి' చిత్రంలో ఉత్తమోత్తమంగా ఉన్నదని అందరూ చెబుతున్నవాటిలో సంగీతం ఒకటి. అనిల్ బిశ్వాస్ ఇందులో జాతి, రీతి భేదాలకు అతీతమై, మనసుకు హత్తుకొగల మధురమైన శాస్త్రీయ సంగీతాన్ని వినిపించారని విన్నవారు చెబుతున్నారు.

ఈ చిత్రం సోవియట్ దర్శకుడు వాసిలీ ప్రానిన్ మాస్కో వెళ్ళనే విలేఖరులతో మాట్లాడుతూ 'పరదేశి' చిత్ర నిర్మాణం భారతదేశంలో సాగినప్పటి విశేషాలు వివరించారు. భారతీయ కళాకారులు అందరూ అన్నివిధాలా తమతో సహకరించినందువల్లనే కష్టమైన ఈపని, కష్టం అనిపించకుండా హుషారుగా, సరదాగా సాగిపోయిందని, ఒకరి భాష ఒకరికి బోధపడకపోయినా, ఉభయులూ మిత్రులు కాగలిగారనీ ప్రానిన్ చెప్పారు.

* * *

కథానాయకుడు రష్యన్ యాత్రికుడు అథనసీ నికెతిన్. ఇతను 15 శతాబ్దంలో మన దేశం వచ్చి వెళ్ళాడు. ఈ చిత్రంలో అనాటి ఘట్టాలను చిత్రించినపుడు అప్పటి మన వ్యవహారాలు, తీరుతెన్నులూ, దుస్తులూ, పోహలూ ఎలా ఉండేవో తెలుసుకొని, ఆ మేరకు తేడాలు వస్తే స్క్రిప్టులో మార్పులు కూడా చేసినట్లు ప్రానిన్ చెప్పారు.

నికిటిన్ ఈ దేశం వచ్చాక చంప అనే అమ్మాయిని ప్రేమిస్తాడు. ఇక్కడ ఈ ఇద్దరి దృక్పథాలనూ మొదట ఒక విధంగా వ్రాసుకున్నారట. దాని ప్రకారం చంప ఒక విదేశీయుడిని ప్రేమించలేదు అన్నమాత్రం ప్రాతిపదిక అయింది. కాని, చంప పాత్ర ధరించిన నర్గిస్ దీన్ని ఆమోదించలేదు. "మానవ హృదయానికి జాతిభేదాలు



"ముద్రం" చిత్రంలో నర్తకి రాగిణి.

(52-వ పేజీ చూడండి)



"ఎ ఫేర్‌వెల్ టు ఆర్మ్స్" చిత్రంలో గారీకూపర్, హెలెన్ హేయస్. హెమింగ్‌వే నవలలలో చలనచిత్రంగా తయారైన తొలి నవల ఇదే. ఇపుడు ఇదే పేరుతో తిరిగి తయారవుతున్న చిత్రంలో కూపర్ భూమికను రాక్ హడ్సన్ నిర్వహిస్తున్నాడు.

# ★ హెమింగ్‌వే కథలూ, హాలీవుడ్ చిత్రాలూ ★

సాలుకు నాలుగైదు వందల చిత్రాలు నిర్మించి సృష్టించే హాలీవుడ్ పరిశ్రమకు కథలు సంపాదించడం ఎప్పుడూ ఒక సమస్యే. పెద్ద భూకంపం, జపాన్‌లో బ్రిడ్జిమీద బాంబులువెయ్యడం, తుపానులో ఆవాగార్డనర్ చిక్కుకున్నపుడు స్టీవర్ట్ గ్రేంజర్ రక్షించడం, చిరిగిపోతున్న స్కర్ట్ తొడుక్కుని నయాగరాజలపాతంమీదనించి పడబోతున్న పాలెట్ గొడార్డ్‌ను గారీకూపర్ రక్షించుకోవడం, పెద్దపెద్ద హైడ్రోజన్ టాంక్‌ల మీద రివాల్వరుపట్టుకు తిరుగుతున్న జేమ్స్ కాగ్నీని పోలీసు కాల్చిచంపడం, రాబర్ట్ టేలర్, విన్సెంట్ ప్రైస్‌లు 16 వ శతాబ్దపు చర్చిగంటల తాళ్ళు పట్టుకు వేళ్ళాడుతూ, గాలిలో కత్తియుద్ధం చేయడం వంటి "సినిమాటిక్" సంఘటనలు ముందర ఆలోచించుకుని, వాటికి పదివేల అడుగుల ఇవతల ఫిలిం తీయడం మొదలుపెట్టి అక్కడకు చేరుకునే సరికి మామూలుగా కథ తయారవుతూ ఉంటుంది. కొన్ని ఇలా తయారైనా హాలివుడ్ నిర్మాతలు చాలవరకు మంచి మంచి రచయితలకు పుష్కలంగా డబ్బు ఇచ్చి కథలు కొనుక్కుంటారు. ప్రపంచ ప్రఖ్యాతి నొందిన నవలలు ఎన్నిటినో హాలివుడ్ ఉత్తమ చలనచిత్రాలుగా రూపొందించింది. చిన్న కథలతో కూడా చిత్రాలు నిర్మించింది. మామ్ కథలతో నిర్మించిన [illegible]



రచయిత ఎర్నెస్ట్ హెమింగ్‌వే. సముద్రమంత ఆసామి. నేల నాలుగు చెరగులా తిరిగి అనుభవం గడించాడు. ఇపుడు 'ఓల్డ్‌మాన్ అండ్ ది సీ' చిత్రంలో హెమింగ్‌వే, ఆయన భార్య రెండు చిన్న వేషాలు వేస్తున్నారు.

(ఫోటో: జోసెఫ్ కార్ష్ (కెనడా)



నటుడు స్పెన్సర్ ట్రేసీ. హాలీవుడ్ అగ్రశ్రేణిలోని నటులు ఐదుగురిలో ఒకడు. అక్షరాలా ఒక చిత్రాన్ని తన భుజస్కంధాల మీద వహించి, విజయం సాధించగల సమర్థుడు. 'ఓల్డ్ మాన్ అండ్ ది సీ' చిత్రంలో, ముఖ్య భూమికను నిర్వహిస్తున్నాడు.

(కథలు), ట్రియో. (మూడు). అలాగే ఓ. హెన్రీ కథలతో 'ఫుల్ హౌస్' అనే చిత్ర సంపుటిని రూపొందించారు. కొందరు నవలాకారులే హాలీవుడ్‌లో స్క్రిప్టు రచయితలుగా పనిచేశారు—గ్రాహం గ్రీన్, పి. జి. వోడ్‌హౌస్ ప్రభృతులు.

హాలీవుడ్, కథలకోసం అపూరూపంగా ఎంచుకునే వారిలో ఎర్నెస్ట్ హెమింగ్‌వే ఒకరు. ఇప్పటికి హెమింగ్‌వే నవలలు ఏడింటిని హాలీవుడ్ వెండితెర కెక్కించింది—ది కిల్లర్స్, టు హేవ్ అండ్ హేవ్ నాట్ (హంఫ్రీ బోగార్ట్, లారెన్ బెకాల్), స్నోస్ ఆఫ్ కిలిమాంజారో (గ్రెగరీపెక్, ఆవాగార్డ్‌నర్), ఫర్ హూం ది బెల్ టాల్స్ (గారీ కూపర్, ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్), ఎ ఫేర్‌వెల్ టూ ఆర్మ్స్ (గారీ కూపర్, హెలెన్ హేస్), మై ఓల్డ్‌మాన్, ఫ్రాన్సిస్ మెకంబర్. అవన్నీ ప్రపంచవ్యాప్తంగా మన్ననలందుకున్నాయి.

గొప్ప కథలు తీసుకొన్నపుడు అక్కడి నిర్మాతలు కథలోని పాత్రను అందుబాటులో ఉన్న బాక్సాఫీస్ నటుడికి సరిపెట్టి దాన్ని ఖూనీచెయ్యడానికి ప్రయత్నించరు. ఈ దురాచారం పూర్వం కొంత ఉన్నా పుడు పోయింది. పాత్రకు తగిన నటుడినే తుక్కు తెచ్చుకుంటారు. అలా చేయడం వల్ల చిత్రం 'అన్నివిధాలా' (డబ్బు సహా) రాణిస్తుందని ఋజువైంది.



ప్రపంచ వ్యాప్తంగా ప్రశంసలందుకొన్న "ఫర్ హూం ది బెల్ టాల్స్ చిత్రంలో కటినా పాక్సినో నాయిక ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్.

కొత్తగా తయారవుతున్న "ఎ ఫేర్‌వెల్ టు ఆర్మ్స్"లో, మరణోన్ముఖుడైన ఒక ఇటాలియన్ సైనికుడికి ఉపచారంచేస్తున్న రాక్ హడ్సన్.



ఇపుడు హెమింగ్‌వే కథలు మూడింటిని చిత్రాలుగా నిర్మిస్తున్నారు. ఒక్కసారి ఇన్ని నిర్మించడానికి ఇదే తొలిసారి. ది సన్ ఆల్సో రైజెస్ (1926), ఎ ఫేర్‌వెల్ టు ఆర్మ్స్ (1929) ఓల్డ్‌మన్ అండ్ ది సీ. వీటిలో మొదటిదాంట్లో రాక్ హడ్సన్, రెండవదాంట్లో టైరన్ పవర్, అవా గార్డ్నర్ నటిస్తున్నారు.

ఇపుడు నిర్మాణంలో ఉన్న మూడవ చిత్రం "ఓల్డ్ మాన్ అండ్ ది సీ" రచయిత హెమింగ్‌వేకు ఈ నవల 1954లో నోబెల్ బహుమతి గడించిపెట్టింది.

ఇది ఒక క్యూబన్ జాలరి జీవితయాత్ర.

ఈ పాత్రను స్పెన్సర్ ట్రేసీ నిర్వహిస్తున్నాడు.



# నాగేశ్వర రావుకు రాజధాని సన్మానం

ప్రముఖ చలనచిత్ర దర్శకుల ఆంధ్రలో వాడ వాడలా సన్మానాలందుకొన్న నటుడు శ్రీ ఎ. నాగేశ్వరరావుకు ఈ నెల 18 న రాజధాని ప్రజలు గాంధీభవన్‌లో ఘన సన్మానం చేశారు. ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు సభకు అధ్యక్షత వహించారు. విద్యామంత్రి శ్రీ పట్టాభి రామారావు సభికుల తరఫున నాగేశ్వర రావుకు ఒక రజత ఫలకాన్ని, బహూకరించి, సింహ తలాటాలతో డిగి గౌరవించారు. రాజధానిలోని ఇండియన్ నేషనల్ థియేటర్, హిందీ ప్రచారసభ, ఆంధ్ర యువతీమండలి, ఆంధ్ర బాలానంద సంఘం, ఫిలిం వాణిజ్యమండలి మొదలైన సంస్థల తరఫున సన్మానపత్రాలు సమర్పించారు. సభకు ముందు ఏనుగుపై ఊరేగించారు.

నాగేశ్వరరావు కృతజ్ఞత తెలియచేస్తూ ఈ పీఠ నికరాదాయాన్ని విజయవాడలో ఉత్తమ శ్రేణి రంగస్థలం నిర్మించడానికి విరాళం ఇవ్వదలచానని ప్రకటించారు. మద్రాసులో విద్యాసంస్థలకు పైపీఠాది రాబడినిసమర్పించ దలచినట్లు ఈ సందర్భంలోనే ప్రకటించారు.

జూలై 28 న శతదినోత్సవం జరిగిన తరువాత నెల్లాళ్ళపాటు ఆంధ్రలో వాడవాడలా నాగేశ్వరరావు సన్మానాలుఅందుకున్నాడు. పెద్దపట్టణాలలో, అరుదైన పౌరసన్మానాలు జరిగాయి.

'ఈ అభిమానానికీ వాత్సల్యానికీ ఎలా కృతజ్ఞత చెప్పుకోవాలో నాకు తెలియటం లేదు" అన్నారు నాగేశ్వరరావు.

దాదాపు 20 వేల రూపాయలుచేసే కానుకలు ఇచ్చారు. గుంటూరులో గోటరీక్లబ్ వారు, ఆసంస్థ అరుదుగా ఇచ్చే రోటరీ పతకాన్ని ఇచ్చి గౌరవించారు. వరంగల్‌లో 60 ఎద్దుల జతలలో పెద్ద ఊరేగింపు జరిపారు. గుడివాడలో కనకాభిషేకం జరిపారు. చీరాలలో ఒక చేనేత కార్మికుడు ఖద్దరుసిల్కుతో ఒకగుడ్డ నేసి దానిమీద నాగేశ్వరరావు పేరు నేతలోనే కూర్చి పటంకట్టి ఇచ్చారు.

ఇది అపురూపమైన కానుకగా పదిల పరచుకున్నారు నాగేశ్వరరావు.

"ఇవన్నీ ఒకఎత్తు. మహామహోపాధ్యాయ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలవారి ఆశీర్వచనం ఒకటీ ఒకఎత్తు" అన్నారు నాగేశ్వరరావు.

రాజమండ్రిలో నెల్లాళ్ళనాడు సన్మానం మహావైభవంగా సాగుతుండగా, 'తరవాత సభకు వెళ్ళేముందు ఒకసారి ఇటు వచ్చిపో' అని శాస్త్రిలుగారు కబురుపెట్టారట. సుట్టు చప్పుడు కాకుండా నాగేశ్వరరావు, అక్కడికివెళ్ళాడు పిలువవచ్చిన మనిషితో.

'కూర్చో' అన్నారు కవిసార్వభౌము. నమస్కరించి కూర్చున్నాడు నాగేశ్వరరావు.

శాస్త్రిలుగారు, ఆశువుగా పంచరత్నాలు చదివారు. పళ్ళు, తాంబూలం చేతికిచ్చారు. 'బాబూ వృద్ధిలోకిరా' అని దీవించారు.

ఒకక్షణం ఆగి, 'ఇకలే. లేచి త్వరగా వెళ్ళిపో. నీ ఆచూకీ తెలిసి జనం ఇక్కడికి వచ్చేస్తారు' అన్నారు నవ్వుతూ. ★

## పరదేశి

(49-వ పేజీ తరువాయి)

దేశాల ఎల్లలూ సరిహద్దులుకావు." అని ఈమె వాదించి ఈ బృందంలో వారందరికీ నచ్చచెప్పింది. ఇలాగే అనేక విషయాలు గురించి చర్చించుకున్నారు. చిత్రం బాగా రూపొందాలనేదే అందరి ఆశయమూ అభిమతంవల్ల అనేక విషయాలలో వాదించుకుని స్నేహభావంతో అర్థం చేసుకుని తప్పులు దిద్దడం దిద్దుకోవడం జరిగింది. ఈ కథలో పకీరాం అనే పాత్రను బలరాజ్ (దో బిఘాజమీన్)సాహ్నీ నిర్వహించాడు.

"బల్‌రాజ్ నటనలో శారీరకమైన కదలిక కొంత ఎక్కువగా ఉన్నట్లు నాకు తోచింది. చిత్రం ఆద్యంతం కళ దృష్ట్యా ఒక స్థాయి, ఒక మితి, నిర్ణీతమైన గతి ఉండాలి కాబట్టి, నటన కొద్దిగా తగ్గించవలసిందని బల్‌రాజ్‌ను కోరాను. ఇలా అన్ని శాఖలలోనూ ప్రమాణాలను సమన్వయించుకుంటూ చిత్రాన్ని రూపొందించ ప్రయత్నించాము" అని అబ్బాస్ చెప్పారు. ప్రధానమంత్రి నెహ్రూ కూడా కథను విని, కొన్ని మంచి సూచనలు చేశారని ఆయన తెలియచేశారు.

భారతదేశంలో నిర్మాణం పదుమూడాలు సాగింది. మాస్కోలో రెండు నెలలు సాగింది. ఇప్పుడు 'షూటింగ్' పూర్తి అయింది.

ఇంక ఒక్కటే పెద్దపని ఉంది. ఈ చిత్రానికి రెండు భిన్న భాషలలో సంభాషణలు రికార్డు చేయవలసి ఉంది. ★

## బొంబాయి సినిమాలేఖ

(48-వ పేజీ తరువాయి)

మీద శ్రద్ధ వహించాడు. దర్శక నిర్మాతల జాబితాలో చేరాడు. ఇంతవరకూ అతడు నిర్మించిన చిత్రాలు మగూఫా, ప్రిజనర్ ఆఫ్ గోల్‌కొండ, సమందర్ చిత్రాలు ఆర్థికంగా ఘనవిజయం సాధించలేకపోయినా

# 'జల్ దీప్‌కు' వెనిస్ బహుమతి

బాల చలనచిత్రసంస్థవారు నిర్మించిన తొలి బాలలచిత్రం 'జల్‌దీప్', వెనిస్ అంతర్జాతీయ బాల చలనచిత్రోత్సవంలో ప్రథమ బహుమతి గడించుకొంది. 13 నుండి 16 ఏళ్ళలోపు పిల్లల వినోదంకోసం తయారైన చిత్రాలే ఈ పోటీలో పాల్గొన్నాయి. ఈ చిత్రం 1956లో తయారైంది. 1957లో భారతప్రభుత్వం ఈ చిత్రానికి యోగ్యతాపత్రంఇచ్చి గౌరవించింది.

---

(కాబట్టి కళాఖండాలని భ్రమపడరాదు), పరిశ్రమలో పదిమందీ, ప్రేమనాథ్ సమర్థుడని గుర్తించారు. ప్రస్తుతం అతడు డాక్యుమెంటరీ చిత్రాల నిర్మాణంలో కృషి చేస్తున్నాడు. ఈమధ్యనే కైలాసశిఖర యాత్ర చేసి ఒక చిత్రం తీశాడు. పనిలోపని యాత్రకూడా చేసినట్లయింది. ఆ యాత్రా చిహ్నంగా ప్రేమనాథ్ బుగ్గమీసాలు పెంచాడు. వాటివల్ల అతగాడి విగ్రహానికి మరింత నిండుతనం రీవి అబ్బినట్లనిపిస్తుంది.

* * *

నటుడు దేవానంద్ సెప్టెంబరు 26 న ఆర్భాట హడావుడి లేకుండా పుట్టినరోజు పండుగ జరుపుకొన్నారు. జుహూ బీచిలోని అతగాని 'స్వర్గసీమ' (గృహ మేకదా) కు, దగిర వాళ్ళు నలుగురు వచ్చారు. కబుర్లు చెప్పుకుంటూ విందారగించారు. ఆఖర్నే, దేవ్ జీవితభాగస్వామిని కల్పన, అందమైన ఛీకసంచితెచ్చి కానుకగా ఇచ్చింది. అది మేకప్ బాగ్. "ఎలా కనిపెట్టావ్? ఇది కొనాలని ఎన్నాళ్ళనించో అనుకుంటూ, ఎప్పటికప్పుడు మర్చిపోతున్నాను" అన్నాడు దేవ్ ఆశ్చర్యంలో సంతోషం మిళాయించి.

'అర్ధాంగికదా' అన్నా రెవరో నవ్వుతూ .........

## వస్తాద్ వంటి ఉస్తాద్

నటి కామినీకౌశల్ మొన్న యూడవలేదీస ఇంట్లో లక్షణంగా దసరాపండుగ చేసుకుంది. వాళ్ళింటి వంటిల్లు సరికొత్తరకం. అందులో అన్ని సదుపాయాలూ ఉంటాయి. పాత్రలూ, పొయ్యి (ఎలక్ట్రిక్) మొదలైనవన్నీ బెర్లిన్ నుండి తెప్పించింది. ఆరోజు కామిని రకరకాల పిండివంటలు చేసింది. విందుభోజనం తరవాత 'ఉర్దూ కావ్యగాన సభ' జరిగింది. కవి సాహిర్ దామన్. ఆయన పాకిస్థానీ. మనోహరమైన పద్యాలను అతి శ్రావ్యంగా ఆయన చదివాడు. ఆ మనిషి విగ్రహానికీ, ఈ కావ్యపరసానికీ మటుకు పొసగ దనిపిస్తుంది. ఆయన చూట్టానికి పెద్ద వస్తాదులా ఉంటాడు. దుస్తులు కూడా వస్తాదు ఫక్కీలోనే ఉన్నాయి...ఏమైతే నేంగాక, ఆయన కావ్యగానం అద్భుతంగా ఉంది.

* * *

'నయాదౌర్' దర్శక నిర్మాత బి. ఆర్. చోప్రా, నటుడు దిలీప్ కుమార్ మొన్న డార్జిలింగ్ వరకూ కులాసాగా షికారు వెళ్ళి వచ్చారు దిలీప్‌కుమార్ స్వస్థలం పెషావర్. జన్మతః అతడు పఠాన్. ఈసారి షికారులో అతడు తూర్పు పంజాబ్‌లోని చాలా గ్రామాలు తిరిగివచ్చాడు. అటువేపు వంటకాలు 'కుల్చాచోలే' (బన్‌రొట్టె, అందులో నంచుకోవడానికి పప్పుకూర) వంటివి తనివితీరా తినాలని చాలా రోజులుగా అనుకుంటున్నాడు. 'సోలాన్' వంటి గ్రామాలలో 'ఫాన్స్' వెడదలేదు కాబట్టి, స్వేచ్ఛగా నిశ్చలంగా ఊరంతా కాలినడకన తిరిగాడు. ఒక రోడ్డు వార మిఠాయిలు అమ్మేబండిదగిర నిల్చొని సుబ్బరంగా కావలసిన కొరంతీపి కొనుక్కు తిన్నాడు. ఝామని హుషారుగా తిరిగి వచ్చాడు.



దిలీప్‌కుమార్, బృందం డార్జిలింగ్ వెళ్ళినపుడు "హిమాలయ కళామందిర్" వారితో తీయించుకున్న చిత్రం. ఎడమ చివర ఉన్నవారు దర్శక నిర్మాత బి. ఆర్. చోప్రా.

## వార్తలు

ఎం. వి. (ఆశా) రామన్ కొత్త చిత్రం "ఝూకీ ఝూకీ అంఖియాఁ" కు మధురగాయని లతామంగేష్కర్ సంగీత దర్శకత్వం నిర్వహిస్తోంది. రామన్ ఈ చిత్రాన్ని టెక్నికలర్ లో నిర్మిస్తారు. ముఖ్యనటి జయశ్రీ.

* * *

బిమల్‌రాయ్ నిర్మిస్తున్న అపరాధ పరిశోధక చిత్రం "అపరాధి కౌన్"లో లిలియన్ అనే కొత్త నటిని పరిచయం చేస్తున్నారు. అసిత్‌సేన్ దర్శకత్వాన ఈ చిత్రం తయారవుతోంది. 

(ఆంధ్ర వారపత్రిక సౌజన్యంతో...)

# అంతరిక్షయాత్రలో కొత్తమెట్టు

(31-వ పేజీ తరువాయి)

ప్రయోగాలు చెయ్యవచ్చు. అక్కడి స్థలస్వభావాన్ని, వాతావరణ స్వభావాన్ని అది తెలియజేస్తూ ఉంటుంది.

నాలుగో దశలో : మనుషుల్ని కూడా చంద్రగోళానికి పంపిస్తారు. అక్కడ శాశ్వతంగా ఒక పరిశోధనశాలను నిర్మించడానికి ఏర్పాట్లు చేస్తారు. అందులోని మనుషులకు గాలి, నీరు, ఆహారం మొదలైనవాటిని రాకెట్ల ద్వారా ఎప్పటికప్పుడు సరఫరా చేస్తారు. వాళ్ళు తిరిగి రావాలనుకుంటే రావడానికి కావలసిన యంత్రాలను కూడా అదేవిధంగా రాకెట్లతో పంపిస్తారు. అక్కడికి వెళ్లిన వారు ఎంతకాలమనుకుంటే అంతకాలమూ అక్కడ జీవించవచ్చును. రేడియో, టెలివిజన్ యంత్రాల ధర్మమా అని వారికి భూమితో సంబంధ బాంధవ్యాలు తెగిపోవు. ఏంకావాలంటే అది తెప్పించుకో వచ్చును. వారికి అన్ని దేశాల శాస్త్రజ్ఞులు, వైద్యులు ఏ సలహా కావలిస్తే ఆ సలహా ఇస్తూంటారు.

## మూడు పథకాలు

చంద్రలోక ప్రయాణం కేవలం సుదూర స్వప్నం కాదనీ, సోవియట్ శాస్త్రజ్ఞులు ఇందుకు ప్రయత్నిస్తున్నారనీ మాస్కో రేడియో ప్రకటించింది. ఇందుకుగాను మూడు వేర్వేరు పథకాలు తయారుచేశారు. ఒక పథకాన్ని ప్రొ॥ చెబోటరెవ్ నిర్వహిస్తున్నాడు. పదిరోజులపాటు ప్రయాణంచెయ్యడానికి ఈ పథకంలో ఏర్పాట్లున్నాయి. ఈ ప్రొఫెసరు పంపించే రాకెట్ చంద్రగోళంలో దిగలేదట. కొన్ని వేలమైళ్ళ ఎత్తున చంద్రుడిచుట్టూ రాకెట్ తిరుగుతుందట. దీనికాశ్టే శ్రమపడి బ్యాటరీలు ఎక్కువగా సప్లయి చేయనక్కరలేదట. భూమి, సూర్యుడు, చంద్రుడు ప్రసరించే ఆకర్షణశక్తివల్లనే అది చాలా దూరం ప్రయాణం చేస్తుందట.

రెండో పథకాన్ని 25 ఏళ్ళ యువశాస్త్రజ్ఞుడు యుగోరోవ్ నిర్వహిస్తున్నాడు. ఇతడు పంపించే రాకెట్ తను ఇవ్వవలసిన సమాచారం ఇచ్చేసి భూమికి తిరిగిరాకుండా ఆకాశంలోనే ఉండిపోతుందట. ఆ రాకెట్‌లో కామెరాలు మొదలైన సామగ్రి ఉంటుంది. వాటిద్వారా అది చంద్రుణ్ణి గూర్చిన భోగట్టా అంతా సేకరించి మళ్ళీ భూమికి కొన్ని వేలమైళ్ళ దూరందాకా తిరిగివచ్చి, భూమిమీది శాస్త్రజ్ఞులకు ఆసమాచారమంతా అప్పగించి, మళ్ళీ ఇంకోసారి చంద్రుణ్ణి చూసి రావడానికి వెళ్ళిపోతుంది. అది ఇచ్చే సమాచారమంతా ఇచ్చేసిన తరవాత దాన్ని అలాగే వదిలేస్తారు.

మూడో పథకాన్ని పైన చెప్పిన ప్రొ॥ క్లెబ్ జెవిచ్ నిర్వహిస్తున్నాడు. ఈయన పంపించే మూడంచెల రాకెట్‌ను బలమైన రాడార్ కిరణాలతో నడిపించాలి. చంద్రుడి ఉపరితలం ఎలాంటిది, అక్కడి వాతావరణం ఎలాంటిది మొదలైన విషయాలను ఈ రాకెట్ కనుక్కొని అతి శక్తివంతమైన రేడియో యంత్రంద్వారా భూమిమీదికి పంపిస్తుంది. అదిపంపే వార్తలను స్వీకరించడానికి భూమిమీద అన్నిచోట్లా శబ్దగ్రాహక కేంద్రాలను ఏర్పాటు చేసుకోవాలి.

దాదాపు కాంతివేగం (సెకండుకు 1,86,000 మైళ్లు)తో సమానమైన వేగంతో ప్రయాణం చెయ్యగల యంత్రాలను కూడా తయారుచేయడానికి తాము కృషి చేస్తున్నామని రష్యన్ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఈ యంత్రాలే సాధ్యమైతే చంద్రుడిలోకి వెళ్లడానికి మూడు సెకన్లు కూడా పట్టదు. ఇది సాధ్యమైనా కాకపోయినా సోవియెట్ శాస్త్రజ్ఞుల సాహసోపేతమైన ఆలోచనలనైనా అభినందించవచ్చును.

## ఖండాంతరవేధి

శాస్త్రజ్ఞుల ఆలోచన లిలా ఉండగా, రాజకీయజ్ఞుల భావాలు మాత్రం మరో విధంగా ఉన్నాయి. అమెరికా అధ్యక్షుడు రష్యన్‌గోళంవల్లమిలిటరీప్రమాదమేమీ లేదని అంగీకరించారు. కాని డెమొక్రాటిక్ పార్టీ నాయకుడు అడ్లాయ్ స్టీవెన్సన్ ఈ కొత్త సంఘటనవల్ల తమపేరు ప్రతిష్ఠలకేకాక శాంతిభద్రతలకుకూడ ముప్పు ఏర్పడిందని విచారపడుతున్నారు. కృత్రిమ ఉపగ్రహాలను, స్వయంచోదితాస్త్రాలను అంతర్జాతీయంగా అదుపుచేసేందుకు అమెరికాతో ఒడంబడికకు తాము సిద్ధంగా ఉన్నామని రష్యన్ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి నికితా క్రుశ్చేవ్ ఇటీవల ప్రకటించారు. క్రుశ్చేవ్ ప్రతిపాదనకు అమెరికా అంగీకరించేటట్లే కనబడుతోంది. సమితిలో అమెరికన్ప్రతినిధి హెన్రీకాబట్‌లాజ్ ఈనెల 10వ తేదీన మాట్లాడుతూ, ఆకాశంలో బాగా ఎత్తున ఎగిరే రాకెట్ యంత్రాలు కేవలం వైజ్ఞానిక శాంతిప్రయోజనాలకే తప్ప ఇతర ప్రయోజనాలకు ఉపయోగించకుండా ఒడంబడిక కుదుర్చుకోడానికి తాము సిద్ధంగా ఉన్నామని అన్నారు.

దీనిఅంతరార్థంఇది:కృత్రిమ"ఉపగ్రహం" వలెనే ఖండాంతరవేధియైన రాకెట్‌కూడా ఆకాశంలో కొన్ని వందలమైళ్ళ ఎత్తుకు ఎగురుతుంది. అతివేగంతో, కొద్ది నిమిషాలలోనే కొన్ని వేలమైళు ప్రయాణంచేసి మళ్లీ భూమి వాతావరణంలోకి చొచ్చుకువచ్చి నిర్దేశించిన లక్ష్యంమీదపడి ఉదజనిబాంబు ద్వారా ధ్వంసం చేస్తుంది. ఈ ఖండాంతర వేధి రష్యావద్ద ఉన్నట్లు వెల్లడిఅయింది. అందుచేతనే కొన్ని వందలమైళ్ళు పైకెగిరే అన్ని రాకెట్లను శాంతి ప్రయోజనాలకేగాని విధ్వంస కార్యాలకుపయోగించకుండా చేయడానికి అమెరికా ప్రయత్నిస్తున్నట్లు కనబడుతోంది.

అణ్వస్త్రాలలోను, ఉదజని అస్త్రాలలోను తమదే పైచెయ్యి అని నమ్మినంతకాలమూ అమెరికా వాటి నిషేధానికి, అదుపుకు ఏవో అభ్యంతరాలు చెబుతూ, వాటికి ఇతర రాజకీయ సమస్యలకూ ముడిపెడుతూ కాలక్షేపం చేసింది. ఇప్పుడు వాటికి మించిన ఖండాంతరవేధులు రష్యాకు లభ్యమయ్యే సరికి "ఇక ఏ యితర సమస్యలతో నూ ముడిపెట్టకుండా" వాటిని అదుపు చేయించడానికి ప్రయత్నిస్తున్నది. తమది పైచెయ్యి అయినప్పుడు ఏ ఒప్పందానికీ ఒప్పుకోక పోవడం, తమది పైచెయ్యి కానప్పుడు రాజీకి దిగడం చూస్తే, ప్రస్తుత ప్రపంచ రాజకీయాలు ఎంత స్వార్థకలుషితమై పోయినదీ, ప్రపంచప్రజల శాంతి సౌభాగ్యాలతో రాజకీయ నాయకులు ఎలా చదరంగపు ఆటలాడుతున్నదీ బోధపడుతుంది.

ఐక్యరాజ్య సమితిలో నిరాయుధీకరణపై చర్చలు ఇప్పుడు జరుగుతున్నాయి. తిరుగులేని మహాస్త్రాలు ఒకదాన్ని మించి మరొకటి తయారవుతూ యుద్ధప్రమాదాన్ని ఎంత దూరం చేస్తున్నాయో అంత దగ్గిరా చేస్తున్నాయి. యుద్ధావకాశానికి శాంతి అవకాశానికీ మధ్య వెంట్రుక వాసియైనా ఎడమే లేనట్లు కనబడుతోంది. యుద్ధమేవస్తే సర్వనాశనం తప్పదు. అందుచేత యుద్ధాన్ని వరించడమో శాంతిని వరించడమో తేల్చుకోవలసిన సమయం ఇదే. ★

# అభిధ

(22వ పేజీ తరువాయి)

"నీకోసమే వేయించాను రెండుకోట్లు !" అంది, కొత్తబట్టలు తెచ్చి పెట్టెలో పెడుతూన్న చిన్న మరదలు.

"అదేమిటే మా నాన్న నాలుగుబళ్ళు తెప్పిస్తే పరకా మిగిల్చావు కాదుటా !" అని గడప దాటాడు.

అందరూ వసారాలోకి వెళ్ళిపోయారు, పెద్దకంఠం వినిపించేసరికి.

ఉషాదేవి నెమ్మదిగాలేచి, పిల్లాణ్ణి భర్త కందించి నడికట్టు సరిజేసుకుంది.

అతను పొందిగ్గా అందుకుని బహు సున్నితంగా ముద్దాడి భార్య కందించాడు.

పిల్లాణ్ణి భర్త చేతుల్లోంచి అందుకుని పైట చెంగు చాటుచేసి పాలిస్తూన్న ఉషాదేవి కన్నులు గర్వంతో మెరిసిపోయి సిగ్గుతో వ్రాలిపోయాయి. అతని వైపు ఆమె నేరుగా చూడలేక పోయింది. ఏదో తెలీని లజ్జ ఆమెను కౌగిలించుకుని ముద్దాడుతున్నది. భర్త వైపు చూడాలని గుండె గుసగుసలాడుతుంది, మనస్సు మరీ మరీ వెనక్కు లాగేస్తుంది. ఆయన చేతుల్లో పసిబిడ్డనుంచి ఎదురుగా నిలబడి ఏమేమో మాట్లాడాలని కోరిక. కోరిక కోరకం వికసించదు. వికసించని మొగ్గమీద తుషారబిందువులు పడి పులకించి తులికిస్తున్నవి.

అతను రెండు మూడు క్షణాలు నిశ్శబ్దంగా నిలబడి :

"అయితే ఈ పూట నామకరణం చేసెయ్యాలేమిటే?" అన్నాడు చిబుకం పుణుకుతూ.

"ఏమో నాకేం తెలుసూ?" అని-ఉయ్యాలలో రబ్బరుగుడ్డ సరిజేసి నిద్రపోయే 'కన్న తండ్రి'ని బజ్జో బెట్టి, బొడ్డుమీద గుడ్డకప్పింది కొత్త శాలెంతరాలు.

"ఏం తెలుసునో మరి?" ఉయ్యాల గొలుసు పుచ్చుకు నిలబడి అడిగాడు.

"నా కేమీ తెలీదని మీ రే అన్నారుగా?"

"ఏమీ తెలీకుండానే బియ్యే ప్యాసయి, పిల్లాణ్ని కన్నావేం? అంటూండగా గదిలోంచి ఉడాయించేసింది, శోభనం నాడు తెల్లవారుతూండగా తల్లి పిలుపు విన్న పిల్లలా-ఉషాదేవి.

ఒక్క నవ్వు విసిరాడతను.

అతను అలాగే నిలబడి ఆలోచిస్తున్నాడు నిద్రపోతున్న పసివాడు నవ్వుతున్నాడు. వాడి నవ్వు అతని హృదయానికి చక్కిలిగిలి పెట్టింది. బుగ్గమీద చెయ్యేశాడు-ఉలిక్కి పడ్డాడు పిల్లాడు. ఖంగారుపడి వెనక్కు తగ్గాడు.

ఎంతసేపు ఆలోచించినా అతనికి అందమయిన పేరు దొరకలేదు, దొరికిన పేరులో ఏదో పరుషాక్షరం గోచరిస్తున్నది. అన్నీ సరళాలే అయినా మరీ మెత్తగా ఉన్నట్టే అనిపిస్తోంది పది పదిహేను మంది స్నేహితుల పిల్లలకు నిమిషాల మీద నామకరణోత్సవం జరిపించిన తను తన కొడుక్కి పేరు పెట్టవలసి వచ్చే సరికి భువనభవనం అంతా కదలించాల్సి వస్తూన్నది.

చిత్రంగా నవ్వుకున్నాడు.

తన కోసమే అయినా పైకి వెలువడిన నవ్వు విని అప్పుడే గది ప్రక్క గదిలోకి అద్దం కోసం వచ్చిన మరదలు :

"ఏం మురిసి పోతున్నావోయ్ బావా, అంతా నీ గొప్పే అనుకుంటున్నావ్?" అంది-దానిమాట ఎంతశిరీషకుసుమపేశలంగా ఉందో, ఆమాటలోని ధ్వని అంత క్రొవ్వాడి శరంలానూ అతని గుండెలోకి నడిచింది.

ఆడదానికి ఎంత అహంకారం! ఎటువంటి నిరసన? ఒక్క బిడ్డనుకనే సరికి ఎంతటి స్వామ్యం వస్తుందీ ! !

తన వెర్రి ఆలోచనకు తనే నవ్వుకుంటూ:

"ఏమే...ముంజలు కోటి స్తానని మీ అక్కయ్యచేత ఉత్తరం వ్రాయించావు కదా?" అన్నాడు అనవసర ప్రసంగానికి అంకురార్పణచేస్తూ.

"చాల్లే—అలాటి అబద్దాలాడితే అరడజను మంది పుడతారు ఆడపిల్లలు..."

"నీ లాటి వాళ్ళేనా?"

"పోదూ...దానికేం కాని బావా...... చెప్పవూ ఏం పేరు పెడతావో?" అని గునిసింది గడపలో నిలబడి కుంకుమ బొట్టు సరిజేసికొంటూ.

"నీ పేరెట్టనా?" అని బుగ్గమీద చిటికె వేసేంతలో తుర్రుమంది.

అంతలోనే మళ్ళీ వచ్చి:

"ఊరికే అంటావు కానీ పెడతావా? ఏమిటే?"

"నువ్వడిగితే పెట్టనన్నానా? ఎదీ నీ బుగ్గ యిలా పెట్టి అడుగూ?"......అని కదలబోయాడు.

ఆ కర్ణాంతం సంధించి విడిచిన బాణంలా దూసుకుపోయింది.

పైమీది తువ్వాల్ తో ముఖం ఒత్తుకుంటూ వీధివైపు అడుగులు వేశాడు.

ఎదురుగా వచ్చాడు పోస్టుమాన్!

వస్తూనే టెలిగ్రాం అందిచ్చాడు.

ఆతురతతో విప్పిచూశాడు.

"మీ కళ్యానికి నా శుభాకాంక్షలు!" చదువుతూనే దొడ్డి వాకిట్లోకి నడిచి భార్య చేతిలో ఉంచాడు.

వచ్చీరాని అక్షరజ్ఞానంతో కూడ బలుక్కుని:

'కళ్యాణి'

అని చప్పట్లు కొడుతూ, జారిపోయే పైటకూడా సరిజేసుకోకుండా అందరికీ వార్త అందజేసింది మరదలు. 

## పాత బంగళా

(26-వ పేజీ తరువాయి)

తనతల దూర్చాడు.

ఏభైగజాల దూరంలో ఒక అగ్గిపుల్ల వెలిగింది. అస్పష్టమైన మానవాకృతి కనబడింది. అది వారిదిక్కే వడుస్తూ వస్తూండటం రాజారావు బాగా గమనించాడు. కట్టె చప్పుడుకూడ వినవస్తోంది. రాజారావు గుండె వేగం ఎక్కువవుతోంది.

"దయ్యం......" అస్పష్టంగా అనబోయాడు. సారంగధర్ మాట పైకిరాకుండా నోరు నొక్కేశాడు.

చప్పు డధికమయింది. చుట్టనిప్పు అగుపడుతోంది. మధ్య మధ్య నిప్పు క్రిందకుదిగడం, పైకి వెళ్ళి తిరిగి ప్రకాశించడం జరుగుతుంది. అదీ మనిషిలా నోటికి చేతికి తీసుకుంటుంది గాబోలును—అనుకున్నాడు రాజారావు.

—ఖాండ్రించి వుమిసిన శబ్దం.

"అబ్బా!—మనిషి మల్లేనే—?" కుతూహలం పట్టలేకపోయాడు రాజారావు. గట్టిగా నోరునొక్కాడు సారంగధర్.

ఆ ఆకృతి మెల్లగా బంగళావైపువచ్చింది. నోటినున్న ఆ చుట్టను క్రిందవేసి కాలితో మట్టివేసింది భూతం—

జేబులోంచి పైవ్ సెల్సు టార్చిలైట్ తీశాడు సారంగధరు—

సరిగ్గా టైం—మూడూనలభై చూపుతోంది వాచీ—

'టార్చి వేస్తే ఆ ఆకృతిమీదకు'—అనుకున్నాడు సారంగధర్—

దూరంగా ఏదో వెలుగు కనబడింది—హరికేన్‌లాంతరు. తన ప్రయత్నాన్ని విరమించుకొని అటు చూస్తున్నాడు. అది దగ్గరవుతున్నది—

అరుగుమీదున్న ఆకృతి, క్రిందకుదిగింది. అగ్గిపుల్ల వెల్గించి ఆ లాంతరువైపు చూస్తున్నది.

"దాని చేయి మనిషిలా నేవుంది—ముఖం కనబడడం లేదు. ముఖమంతా వెంట్రుకలమయంలాగుందే"—కంపించిపోయాడు రాజారావు.

ఆ లాంతరు వెలుగు చాల దగ్గరయింది. రెండు మూడు అడుగుల చప్పుడు పసికట్టాడు సారంగధర్.

ఊపిరి పీల్చే ధ్వనికూడ ఆపివేశారిద్దరూ—దగ్గింది అరుగుమీదున్న ఆకృతి—

"ఉన్నారు—నువ్వుండు"—

నిశ్శబ్దాన్ని చీల్చుకొని వచ్చాయీ మాటలు—, ఆ లాంతరు వెల్గు ప్రక్కనుండి—

చీకటిలో ఒకరిముఖా లొకరు చూచుకున్నారు సారంగధర్ రాజారావులు—

అచ్చం మనుష్యుల్లానే మాటలు—అనుకున్నారు.

"ఏం ఇంత ఆలస్యం?"—ప్రశ్నించింది.

గభాల్న లేచి నిలబడ్డారు రాజారావు సారంగధర్‌లు.

"టార్చి—వేయ్"—కుతూహలం పట్టలేక గట్టిగా అరిచాడు రాజారావు.

పెద్ద వెలుగు వెలిగింది—ఆ ఆకృతులపైన—నిర్ఘాంతపోయారు సారంగధర్ రాజారావులు—

కరణంగారమ్మాయి మునసబుగారబ్బాయి చేతుల్లో—



(19 వ పేజీ తరువాయి)

విజ్ఞప్తిపత్రాన్ని త్రోసిపుచ్చుతే?"

"సమ్మె!" వెనకనుంచి కీచు కంఠం అరిచింది. "సరే మంచిదే...సమ్మె అంటే మాటలుకాదు. అందులోనూ చేసేది ఉపాధ్యాయులు. మీరు సమ్మె కాదుకదా, నిరాహారదీక్షపూనినా, దేశం స్తంభించదు. పత్రికలు గగ్గోలు పెట్టవు. రైళ్లు ఆగిపోవు. పార్లమెంటు కలవరపడిపోదు. కోర్టులు ఆగవు. ఎటొచ్చీ ... హాహాకారాలుచేసేది మీరే...జీతాలులేక, తిండిలేని మీ పిల్లలు చేసేగోల భరించలేక"—

"అందుకు మేం సిద్ధంగా ఉన్నాం." ఉమాపతిగారు నిశ్చయంగా అన్నారు. పున్నయ్యగారు పకపకమని నవ్వారు. ఆ నవ్వులోని ధ్వని, వ్యంగ్యం తర్వాతగాని తెలిసిందికాదు ఉమాపతిగారికి.

"మీ కార్యదీక్షకు, మీ స్థైర్యానికి నేను సంతోషిస్తున్నాను. గర్విస్తున్నానుకూడా! మీ తక్షణకర్తవ్యం, మీ సంఘమును సుసంఘటితపరచుకోవడం."

"ఏముందీ ... జిల్లా ఉపాధ్యాయులను సమావేశపరుస్తాం."

అన్నారు ఉమాపతిగారు.

"అలాగే చేయవచ్చు. ముందు, సమావేశపరచడానికి, మీ పాఠశాల ఉపాధ్యాయులంతా ఏకగ్రీవంగా తీర్మానం వ్రాయించండి. తర్వాత కార్యక్రమం చూసుకోవచ్చు."

"అదెందుకు?" ఉమాపతిగారి కర్థంకాలేదు.

"మీకు తెలియదు తీర్మానం అవసరంకలవు." అని వెళ్ళిపోయారు.

మర్నాడు ఉదయం, జిల్లా ఉపాధ్యాయులను, తమ కష్టనిష్ఠురములను చర్చించుకొనుటకు, సమావేశపరచుటకు ఏకగ్రీవముగా తీర్మానించడమైనదని ఉమాపతి మొదలి సంతకంచేశారు.

ప్రప్రథమంగా రాజలింగాన్ని కలుసుకొన్నాడు. రాజలింగానికి కాగితంఇచ్చాడు. రాజలింగం, కాస్త చనువును ఆసరాచేసుకొని, ఉమాపతిని మందలించాడు.

"మొదటే నేనా? వెధవబోణీ...నేనే మయిపోతాను? అందరిచేతా కానియ్య..." అని తప్పించుకొన్నాడు.

వెదమూర్తిగార్ని కలుసుకున్నాడు. "నేను ఆనాడే చెప్పాను. ప్రభుత్వం ఉప్పుతింటూ ప్రభుత్వానికి ఎదురు తిరగడమా? క్షమించండి. హిమబిందు "నన్ను ఈ ప్రాపంచికవిషయాలకు మళ్ళించకండి."అన్నాడు. దాసు మేష్టారు వేదాంతం వినిపించారు. ఇలాగే అంతా తలొకవిధంగా చెప్పి, మొత్తంమీద, ఉమాపతిగారితో ఎవరూ సహకరించలేదు...పోతే...ఒక్క ఉమాపతిగారే...ఏకగ్రీవంగా తీర్మానించినట్లు సంతకం పెట్టాడు!

బాధగా, బరువుగా పున్నయ్యగార్ని కలుసుకొన్నాడు. జరిగింది చెప్పాడు. బనవపున్నయ్యగారు గలగలమంటూ నవ్వారు. ఆ నవ్వు అర్థం ఇప్పుడు తెలిసింది ఉమాపతిగారికి. ఆయన అన్నారు..."చూశారా! మీ సుసంఘటితమైన సంఘ ఐకమత్యబలం! ఇలాగే ఉంటుంది. జరిగింది మరచిపోండి. ఎక్కడా చెప్పకోకండి. బాగుండదు."

ఉమాపతిగారు తిరిగివచ్చేస్తూ ... "వెధవది...మేకలు," అనుకొన్నాడు.





Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad



"ఎడారిఓడ"

—ఫొటో : ఐ. రెడ్డి]




దీపావళి [illegible] యీ ఆనంద శుభసమయాల్లో మా కొనుగోలు దార్లందరికి, వారి ఆనందోత్కర్షలకు, ముఖ్యంగా ఆరోగ్యదృష్ట్యా సుఖం చేకూరాలని ఆశిస్తున్నాం. జీవితంలో ప్రతి వ్యక్తికి నిజమైన సుఖం దొరకాలంటే, ఆరోగ్యం బాగుండాలి. ఆరోగ్యం క్షేమంగా వుండాలంటే, జబ్బుల నుంచి రక్షింపు కోవాలంటే, మేము తయారు చేస్తున్న సుప్రసిద్ధ ఆయుర్వేద ఔషధాల్లో నమ్మక ముంచండి. వాటిని ఉపయోగించండి.

**ఆయుర్వేదాశ్రమ ఫార్మసీ లిమిటెడ్**

అహమద్‌నగర్